# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

జూన్ 1976

సంపుటము : 53 సంచిక : 6

విడిప్రతిక వెల రు పాయిన్నర

3

# విషయానుక్రమణిక

## జూన్ 1976



—

# కొత్త నెత్తురు గీతి కావాలి

కీ॥ శే॥ నూతలపాటి గంగాధరం

చిక్కాలు రెక్కలు విప్పుకున్నప్పుడు
   భావాలు చీరలు విప్పుకుంటాయి
భావాలు చీరలు విప్పుకున్నప్పుడు
భాష బంధాలు తెంపుకుంటుంది.

ఆవేశంలో – అన్ని రంగులూ తెగిపోయి
అందరిలోనూ అంతరాంతరాల్లో దాగిన
అచ్చమైన ఆదిమానవుని ప్రవృత్తి
స్వచ్ఛంగా దర్శనమిస్తుంది.

అన్ని తెరల్ని చీల్చి, అడుగు పొరల్ని పొల్చి
లోతులు చూడగల నైతిక నయనాలున్నప్పుడు
ఏ ఇజంలోనైనా నిజం ఖనిజం
నిజంగా, సహజంగా ప్రకాశిస్తుంది.

అంతస్తులూ, అధికారాలూ, అహంకారాలూ
అనాది–అంతరంగం నుంచి ఆవిర్భవించినవా?
భాషలూ, వేషాలూ, ద్వేషాలూ
వేసిన రంగు లెంతకాలం ఉంటాయి ?

ఒర నుంచి తీసిన కత్తి
కల నుంచి లేచిన క్రొత్త స్ఫూర్తి
విద నుంచి దూసిన గీటి
చెమట నుంచి మెరసిన సిరి

ఇవన్నీ కావాలి నగ్నంగా, ఉద్విగ్నంగా!
గుండెల్ని చీల్చేది, గాయాల్ని కాల్చేది
కలకాలం నిల్చేది, కన్నీళ్లని తుడిచేది
కొత్త నెత్తురు గీతి కావాలి!

# బాంబు ప్రేలుతుంది

కీ॥ శే॥ నూతలపాటి గంగాధరం

బాంబు ప్రేలుతుంది–
   ఇప్పుడో, మరుక్షణమో!

పేదవాళ్ళ మాంసపు ముక్కల్ని
నెత్తురులో నంజుకుని,
విలలేని వాళ్ళ చెమట నీటిని
క్షణానికి గ్లాసెడు మద్యంగా సేవిస్తూ,
స్వార్థం మత్తులో ఆనందంగా కేకలువేస్తూ,
విందు కుడుస్తున్న పగటి దొంగల బృందం మధ్యలో...

ముందు ముందుకు నడచే ప్రగతిరథానికి
అడుగడుగునా అడ్డుగ్గరలువేసి

ప్రజల్ని పాతమురికి గుంటల్లోకి నెట్టేస్తూ
ప్రజా సారథులమనే కిరీటాలతో తిరిగే
బలిసిన పందికుక్కల బొజ్జల్ని చీల్చడానికి...

కాలం కదలికను గుర్తించక
కుళ్ళిన రొమ్ముల కౌగిళ్ళలో
కంపును తింటూ, కంపును తాగుతూ
సోమరితనం సుస్తితో మూలుగుతున్న
బురదగుంట పందుల దవడల వెనక...

తప్పక బాంబు ప్రేలుతుంది
ఇప్పుడో, మరుక్షణమో !

# సాహిత్యవ్యాప్తి: ప్రమాణాల పరిరక్షణ

శ్రీ తిరుమల రామచంద్ర

దేనికయినా ప్రమాణాలు ఎవరైనా కర్ర పట్టుకొని బెదిరిస్తే ఏర్పడేవికావు ఇది ఇలాగే వుండాలి అనే సుగ్రీవాజ్ఞలకు ఏదీలొంగదు. అలా లొంగేట్టయితే, ప్రపంచంలో ధర్మబోధ ఎంత జరిగినా, ఇంకా అన్యాయం ఎందుకుంది? మానవుడు రోజుకొక చట్టం చొప్పున ఎందుకు చేయవలసి వచ్చింది? వస్తున్నది? మనుస్మృతి మొదలు భీమస్మృతివరకు ధర్మశాస్త్రం ఎందుకు పెరగవలసివచ్చింది? కనుక ధర్మశాస్త్రాలు, దండనీతులు ప్రమాణాలను పరిరక్షించలేవని మనం గ్రహించినట్టేగదా?

సాహిత్యం కూడ దీనికి లపవాదమేమీకాదు. ఎందరు ఎన్ని లక్షణాలు రచించి బంధించినా, ఏ రచనా ఆ బంధాలకు కట్టుబడ లేదు. కావ్య ప్రయోజనం గురించికాని, కావ్యం విలువలు గురించికాని ఏవరిమాటా నిలువలేదు. ఎవరిదీ ఆ పరాస్తమూ కాలేదు. ప్రమాణాలు, ప్రయోజనాలు పరస్పర సంబంధాలు గనుక ప్రమాణాలకు ముందు ప్రయోజనాలను గురించి ఉట్టంకిస్తాను.

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ,
కరోతి కీర్తిం ప్రతించ సాధుకావ్య నిషేవణమ్"

సాధుకావ్య సేవనం ధర్మార్థ కామమోక్షాలలోను, కళలలోను ఏది గ్రాహ్యం, ఏది అగ్రాహ్యం అనే విచక్షణతను, కీర్తిని, ప్రీతిని కలిగిస్తుంది—అనే భామహుని మాటను మనం చదివినప్పుడు, ఇవి సాధించడానికి మరొకటిలేదా?—అనే ప్రశ్న ఉదయిస్తుంది; దీనికి సాహిత్య దర్పణకారుడైన విశ్వనాధుడు.

"చతుర్వర్గ ఫలప్రాప్తిః వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖా దేవ పరిణత బుద్ధీనామేవ జాయతే; పరమానంద సందోహ జనక తయా సుఖాదేవ సుకుమార బుద్ధీనామపి పునః కావ్యాదేవ."

వేదశాస్త్రాలు నీరసమయినవి. వాటివల్ల కష్టంతో పరిణత బుద్ధులైన మానవులు చతుర్వర్గ ఫలప్రాప్తి పొందుతున్నారు. కావ్యాలు పరమానంద సందోహ జనకాలు గనుక వాటివల్ల పామరులకు సులభంగా చతుర్వర్గ ఫలప్రాప్తి కలుగుతుంది—అని సమర్థించాడు. అయినా ఎన్ని కావ్యాలు ఎందరి మనస్సులను మార్చాయి? కావ్యాలే మానవుల మనస్సును మార్చేటట్లయితే, ఒక్క కావ్యం చాలు.

ఇతర మతస్థులు అందంగా కావ్యాలు రచించి జనాన్ని తిప్పుకొంటారని భయపడి కాబోలు "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని ధర్మశాస్త్రాచార్యులు శాసించారు! దీనికి సమాధానమన్నట్టుగా సేతుబంధ కారుడు వాకాట ప్రవరసేనుడు ...

"పరివడ్ఢఇ విణ్ణాణం
సంభావిజ్జఇ యసో, విఢప్పంతి గుణా,
సువ్వఇ సుపురిస చరియం
కిం తం జేణ న హరంతి కవ్వాలావా.

పరివర్ధతే విజ్ఞానం,
సంభావ్యతే యశః, అర్జ్యంతే గుణాః,
శ్రూయతే సుపురుష చరితం,
కిం తద్ యేన నహరంతి కావ్యాలాపాః"

విజ్ఞానం వృద్ధిపొందుతుంది; కీర్తి వ్యాపించి గౌరవం కలుగుతుంది. గుణాలు పొందవచ్చు. సత్పురుషుల చరిత్రలు వినవచ్చు. కావ్యాలకు ఆ కష్టం కానిది ఏమిటి?—అని అన్నాడు. ప్రవరసేనుడు కావ్యాన్ని మైత్రితో పోల్చి మైత్రిని చివరంటా నిర్వహించడం ఎలా సాధ్యంకాదో, కావ్యాన్ని మొదటినుంచి చివరిదాక నిర్వహించడం సాధ్యంకాదన్నాడు.

"అహినవ రాయారద్ధా
చుక్కక్ఖలిఏసు విహడిఅ పరిట్ఠావియా

"మైత్రీ ఆ పమహారసి ఆ
జివ్వోథుం హెూఖ దుక్ఖరం కవ్వకథా
అభినవ రాగారబ్ధా
చ్యుత స్ఖలితేషు విఘటిత పరిస్థాపితా,
మై తీవ ప్రముఖ రసికా
విర్వోథుం భవతిదుష్కరం కావ్యకథా."

ఇక ఆనందవర్ధనాచార్యుడు ధ్వని అనే అపూర్వ ఆలోకం-కాంతి

"ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,
యత్తత్ప్రసిద్ధావ యవాతిరిక్తం
విభాతి లావణ్య మివాంగనానామ్."

లలనల దేహంలో ఆవయవాతిరిక్తమైన, అవయవ సౌష్ఠవాదులకుమించిన లావణ్యం మిసమిసలాడుతున్నట్టు మహాకవుల వాక్కులలో పద పదార్థాతిరిక్తమైన మరొక అర్థం భాసిస్తుంది అని అన్నాడు. "కావ్యార్థ వివేకోయాయం చేతశ్చమత్కృతి విధాయి...సహృదయోదయలాభంచ." కావ్యార్థ వివేకమనేది చేతశ్చ మత్కృతి విధాయి-మనోవికాసం కలిగించేది.. దీనివల్ల సహృదయులు ఏర్పడడమనే మరొకలాభం- అనీ అన్నాడు ఆనందవర్ధనుడు.

అభినవగుప్తాచార్యులు కావ్యాలకు ప్రీతి ప్రధానమని, ఇదే వేదాదులను కావ్యంనుంచి విడదీసే టటువంటిదని, ఆ ప్రీతి అనేది ఆనందమేనని అన్నారు.

ఇక మమ్మటాచార్యుడైతే బండగా కావ్య ప్రయోజనాన్ని ఇలా వివరించాడు :

"కావ్యం యశసేర్థకృతే
వ్యవహారవిదే, శివేతర క్షతయే,
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశయుజే,"

కావ్యంవల్ల కీర్తివస్తుంది. డబ్బువస్తుంది. వ్యవహారజ్ఞానం తెలుసు కోవచ్చు. అమంగళం నిహతమవుతుంది. వెంటనే ఇతరులను సంతోష పెట్టవచ్చు. కాంత చెప్పినట్టుగా ముచ్చటగా చెప్పవచ్చు-అని. పాపం! ఇతనికి కీర్తి, డబ్బు ప్రధాన ప్రయోజనాలయాయి.

ఇక, సర్వనూ రసదృష్టితో చూచిన జగన్నాథ పండితుడు "వాక్యం రసాత్మకం కావ్యం"-రసాత్మకమైన వాక్యమే కావ్యం-అని నిర్వచించారు.

ఇక పాశ్చాత్యుల భావాలు చూద్దామా, ప్రాచ్యుల భావాలతో అవి సరిసమానంగానే కనిపిస్తాయి:-

కేవలం ఆనందమే కావ్య ప్రయోజనం - అంటాడు కేస్టల్ వెట్రా.

ఆనందకరమైన బోధే కావ్యప్రయోజనం - అంటాడు స్కాలిజర్.

ఉపదేశించడం, ఆనందించడం, ఆనందపరచడం కావ్య ప్రయోజనాలు-అన్నాడు ఫిలిప్‌సిడ్నీ.

ఆనందం ముఖ్యప్రయోజనమని, ఉపదేశం ఆనుషంగిక ప్రయోజనమని అంటాడు జాన్ డ్రెయిడెన్.

ఆహ్లాదకరంగా ఉపదేశించడమే కావ్యప్రయోజనం-అంటాడు డాక్టర్ జాన్సన్.

ఆనందం ఎప్పుడు కావ్యాన్ని వెన్నాడుతూ ఉంటుంది-అంటాడు షెల్లీ.

విజ్ఞాన వినోదాల సమ్మేళనం కావ్యప్రయోజనం-అన్నాడు హెూరేస్.

ప్రాచీన ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులందరూ అలితకళలు స్వయం భువులని; అవి సంఘాన్ని తీర్చిదిద్దుతాయని భావించడంవల్ల ఈలాటి కొలబద్దలు చాచి, ప్రయోజనాలకోసం, మూల్యాల నిర్ణయం కోసం ప్రయత్నించారు. ముఖ్యంగా ప్రాచ్యులు శబ్దాన్ని బ్రహ్మగా భావించేవారు గనుక, ధ్వనిని- రస స్వరూపమయిన ధ్వనిని సాక్షాత్తు పరమాత్మగానె భావించేవారు గనుక, ధ్వని ప్రతీయమానమవుతుందని, శబ్దంవల్ల-కావ్యంవల్ల కలిగే ఆనందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని ఏమిటేమిటో చెప్పారు. బ్రహ్మానంద స్వరూపం తెలియడానికి మనం తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లిలోని వాక్యాలు చూద్దాము:-

"యువా స్యాత్సాధుయువా అధ్యాయకః, ఆశిష్ఠో దఢిష్ఠో బలిష్ఠః. తస్యేయం పృథివీసర్వావిత్తస్య పూర్ణాస్యాత్. స్యఏకో మానుష ఆనందః." ఒక యువకుడు ఉన్నాడనుకొందాము. అతడు మంచి యువకుడు; బాగా చదువుకొన్నవాడు; అతడు ఉత్తమగుణవంతుడు; చాల చురుకైనవాడు; దృఢసంకల్పుడు; ఆ సంకల్పాన్ని ఆచరణలో పెట్టగల బలంకలవాడు; దృఢగా తుడు; అలాటివానికి సమస్త సంపదలతో నిండిన ఈ భూమి అధీనమయి ఉందనుకుందాము. అప్పుడు, అలాటివానికి కలిగే ఆనందం మానుషానందం - ఇలాటివి ఎన్నో వేలయితే బ్రహ్మానందమవుతుంది.

వీరు కావ్యాత్మను ఏరూపంలో నిర్వచించినా, కావ్యప్రయోజనం ఏమని చెప్పినా భగవత్స్వరూపమైన శబ్దం సంస్కారాన్ని, మానవుణ్ణి మార్చుతాయని నమ్మినవారు గనుక, ఆత్మసిద్ధాంతాన్ని ప్రతి దానికి అన్వయించడానికి ప్రయత్నించి, కళాస్వరూపావిర్భావ రహస్యాన్నే విస్మరించారు.

నిజానికి, కళ సంఘాశ్రయమేకాని, సంఘశాసకం కాదు. సంఘం – లేక సమాజం మారుతున్నకొద్దీ, దాని అవసరాలకొద్దీ కళలు ఏర్పడుతాయి. రూపుదిద్దుకుంటాయి. సమాజంలో ఏర్పడిన నీతిగాని, వ్యవస్థగాని ఏకారణంవల్ల మారినా దానినిబట్టే కళలు తీగలు వాగుతాయి. మనిషి, మనసు వికసించడంలో ఆవిర్భవించినవి గనుక కూడు గూడు కూడుంలో మాత్రమే సంతృప్తిపడని సహృదయులైన వారికందరికీ తెలుసు. ఉదాత్తభావాలు, ఉత్తమ సాధనాలు లేనప్పుడుగూడ మానవుడు తనకు లోచిన రీతులలో చేతికందిన జేగురుమట్టితో ఏవేవో స్వరూపాలు గీసుకొన్నాడు; ఏవేవో కూని రాగాలు తీసుకొన్నాడు. అదే మానవజీవి మనస్సులోని కళాతృష్ణ. ఈ కళాతృష్ణకు పరమావధి ఆనందం పొందడం. తన సుఖమయ జీవితానికి భౌతికమైన వస్తు సముదాయాన్ని సృష్టించుకొన్నట్లే, ఆనంద సంధాయకమైన కళను సృష్టించుకొన్నాడు. ఆనందమిచ్చేది సౌందర్యం. సౌందర్య సంధాయకం కళ. దీనినే మిత్రుడు రాంభట్ల కృష్ణమూర్తి 'జగత్తును సౌందర్యదృష్టితో దర్శించి సుందరంగా చిత్రించేది కళ అని స్వీకరించాడు. మానవుడు తన అవసరాలు తీరిన తర్వాత, జగత్సౌందర్యాన్ని అవగాహన చేసుకొని ఆ జగత్తును సుందరంగా మార్చడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఈ ఆనందాన్ని సమకూర్చేది, అతని మనుగడకు ఆలంబన మైనది సమాజం. మానవుడు వ్యష్టిగా ఏమీ చేయలేడు. సమాజం జీవనది; నిరంతర ప్రవాహశీలం.

ఈ సమాజంలోని మార్పులను, విలువలనుబట్టే తక్కిన కళలలాగే సాహిత్యమూ పుడుతుంది. అది అపౌరుషేయమేమీకాదు.[1] మానవుడు సుఖమయజీవితం గడపడానికి కొన్ని నిత్యమైన విలువలు– నిత్యమనడంకంటే విలువలు అందాము–ఏర్పడుతాయి; మానవుని మానవుడుగా చూడడం, నిజం చెప్పడం–ఈ నిజానికీ ఎన్నో నిర్వచనాలున్నాయి-వంటివి. ఇవి సంఘంలో ఒక వ్యవస్థిత జీవితం. సువ్యవస్థిత జీవితం సాగించడానికి అవసరాలు. మంచి, చెడూ అనవి నిరంతరం సంఘర్షిస్తూ సమాజంలో మార్పులకు కారణమవుతాయి. ఇవి కళాకారుల చేతుల్లో సుందరరూపం దిద్దుకుంటాయి. ఒకప్పుడు అన్న మరణిస్తే, అన్నభార్యను తమ్ముడు పెళ్లాడే వ్యవస్థ ప్రబలంగా ఉండేది. ఇది కాలాను గుణంగా జుగుప్సాకరమైంది. దార్శనికులు దీనిని ఖండించారు, దానితో అన్నభార్యకు సంఘంలో తల్లిస్థానం ఏర్పడింది. దానితో నూతన నీతి ఏర్పడింది. దాని వైభవ వర్ణనమే వాల్మీకి రామాయణం. ఈ నూతనరీతి వాల్మీకి వ్యవజ్ఞంకాదు. వాల్మీకి అంతగా చెప్పిన రామాయణం ఉత్తరభారతంలో–ఎందుకుదేశమంతా ఎంత ప్రచారంలోఉన్నా, కిందికులాలవారిలో అన్న మరణిస్తే, తమ్ముడు అన్న భార్యను పెండ్లాడే పద్ధతి ఇంకాపోలేదే?

కర్మకాండపై జుగుప్సకలిగింది. వర్ణవ్యవస్థపై తిరుగుబాటు చెలరేగింది. కొందరే ఉత్తములా? తక్కినవారు అధములా?–అనే ప్రశ్నలు సమాజంలో పెల్లుబికినవి. ఆస్తికవాదగుంటసంలో జరుగుతున్న అన్యాయాలకు జనం గుండె మండింది. ఈ మంటల్లో ఆవిర్భవించినవాడు సిద్ధార్థుడు. అతడు తన ఆచరణలో నూతనమార్గం చూపాడు. ఆ మార్గ దీధితుల ప్రవాహమే సౌందర నందం కావ్యం.

ప్రపంచంలోగాని, మనదేశంలోగాని ప్రవర్తిల్లిన ఏ ఉద్యమాన్ని పరిశీలించినా, తదనంతర కళారీతులను పరిశీలించినా సంఘం మార్పును సాహిత్యం అనుసరిస్తూ వచ్చిందనే స్పష్టమవుతుంది.

పూర్వం ప్రజలకు కనడం పరమార్థం. ప్రజలోనవి గృహమేధులయ్యేవారు. "దశాస్యాన్ పుత్రానాధేహి పతిమేకాదశం కృధి"– పది మందినికని, భర్తను పదకొండవ వానిగా చేసుకో – అని వివాహ మంత్రాలు ఆశీర్వదిస్తాయి వధువును. ఈ సంఘాచారం రసమయంలో సుందరరూపం ధరించింది. దిలీపుడు సంతానంకోసం పడిన పాట్లు నేడు మనం శత్రువుకుకూడ కోరం. పాతసాహిత్యంలో సంతానంకోసం, సంతా సాధనంకోసం ఒలికించిన సౌందర్యం అంతా ఇంతా కాదు.

కాని, నేడు సంతానంవద్దు. "రెండు మేలు, మూడవది"

---

1 పూర్వం నిప్పు మానవునికి పరమాయుధం. అది క్రూర మృగాల నుంచి రక్షించె దిక్కు, దైవం. యజ్ఞానికి పురోహిత స్వరూపం. అదే హోత. అదే దేవ ఋత్విక్కు. నిప్పు లేకుండా మనుగడ అసాధ్యం. ఇప్పుడూ అంతే. కాని, ఇప్పుడు వంట వార్పులకు, తదితర వాటికి అత్యవసరమనుకొంటే. క్రూర మృగాలబారినుంచి ఆత్మరక్షకు, శత్రువులపై దాడికి – మరెన్నిటికో అగ్ని ఆధారం అప్పుడు. అని అప్పటి సంఘం అత్యవసర వస్తువు. కనుకనే అప్పటి సంఘంలో భావాన్ని మధుచ్ఛందుడు...

"అగ్నిమీడే పురోహితం
యజ్ఞస్య దేవఋత్విజం
హోతారం రత్నధాతమం."

అని గొంతెత్తి ఉంటాడు-సంప్రదాయం ప్రకారమైతే ఈ మంత్రాన్ని దర్శించాడు. ఇది మానవుని తొలి చంధోరూపం; తొలి కవిత. దీనినిగురించి ఒక చిన్న అవాంతర గాథ చెబుతాను. లండన్‌లో తొట్టతొలుత డిక్టఫోన్ కనిపెట్టినప్పుడు, దానిలో మొట్టమొదటిసారిగా పెద్దవానిలో మాట్లాడిద్దామనుకొని మాక్స్ ముల్లర్‌ను పిలిపించారట. కొత్తగా కనుగొన్న యంత్రంకదా! చాల పెద్ద పెద్దవారు సమావేశానికి వచ్చారట. మాక్స్‌ముల్లర్ అగ్నిమీడే పురోహితం – అని ప్రారంభించారట. ఏహో పెద్దమనిషి అని పిలిపిస్తే జానపదభాష మాట్లాడుతున్నాడే అని అందరూ ఈసడించుకొన్నారట. అనంతరం మాక్స్‌ముల్లర్ దాని విశిష్టతను వివరించి, మానవుని తొలి కవితా గళం ఇదేనన్నాడట.

అనేది వేదు ప్రథుసమ్మితంగా ప్రచారమవుతున్నవాక్యం. "ప్రజయా హి మనుష్యః పూర్ణాః" అనే వేదవాక్యం గతి ఏమైంది? సంతాన నిరోధం భ్రూణహత్యవంటిది. వ్యర్థంగా వీర్యపాతం చేయడు మహా పాపంకాదా! మరి కోటానుకోటి ప్రజలు ఈ పాపానికి ఒడి గడితే పాపఫలం ఎవరికి చెందుతుంది? సంఘంలో పూర్వం మహాపుణ్యం అనుకున్నవి నేడు మహాపాపంగా పరిణమించింది! మరి సాహిత్య వేత్తలుగూడ వాటిపై కవితలు, నాటికలు, నృత్యనాటికలు, మహా కావ్యాలుగూడ వ్రాస్తున్నారే? అయినప్పుడు, ఈ కవుల క్రాంత దర్శిత్వం, నాయకత్వం ఏమేమయినట్లు? సంఘాన్ని మార్చగలిగి నట్లా? సంఘం గాడిలోబడి కొట్టుకుపోయినట్లా? ఏది ప్రమాణం? వివరు ప్రమాణం?

కనుక సంఘంలోని పరిణామాలనుబట్టే కళారీతులు ఆవిర్భ విస్తాయి. ఆ కళారీతులు లక్కినవారికి కొంత మార్గదర్శకాలు కావచ్చు; కాని, మరొక మహోద్యమం వచ్చినప్పుడు పాతవేమీ నిలినవు.

అయితే, రామాయణంవంటి వాటికి నేటికీ ఇంత ప్రాచుర్యం దేనికు? — అనే ప్రశ్నఉంది. మానవుడు సమాజంలోని కొన్ని పరిస్థితులకు గురయి, ఆదర్శవాది అవుతాడు. లోకంలో తనఎదుట అన్యాయం జయించడం, న్యాయం పరాజితం కావడం చూస్తున్నాడు. కాని, అవశుడై ఏమీ చేయలేడు. న్యాయం జయిస్తే బాగుండునని అనుకుంటాడు. ఆదర్శంవైపు మొగ్గుతాడు. తనకు అనుకూల మైనది, తాను కోరినది ఎక్కడున్నా దానివైపు అర్రులు చాచుతాడు. రామునివంటి కొడుకుండాలని ప్రతి తండ్రీ కోరుకుంటాడు. సీత వంటి లోకోత్తర సుందరి, అడవులలోను అనుచారిణిగా ఉండగల నిబ్బరం కలది, ఎన్ని ప్రలోభాలకైనా లొంగనిది అయిన భార్య అంటే ఎవరికైనా ఇష్టమే. పాపం పదమూడు సంవత్సరాలలోను ఆ యిల్లాలు కోరింది ఒక్కగా నొక్క జింకను!

అలాటి భార్యఉంటే ఎవరికి ఇష్టం ఉండదు! ఇక రాముని వంటి భర్త కావాలని ఏ ఇల్లాలయినా కోరుకోదూమరి? సకలగుణ సంపూర్ణుడు, పుంసాం మోహనరూపుడు, అన్నిటికీ మించి మహా ధీరుడు, శరణన్నవానిని మన్నించేవాడు, ఇలాటి మగనితో అడవులలో విహరించడం, విశ్రాంతగా జీవితం గడవడం ఏమహిళ కోరదు! ఏ మహిళ గర్వించదు!

ఆదర్శమనేది అతిశయోక్తిగానే ఉంటుంది. లక్ష్మణుని విష యంలో వాల్మీకి ఈ ఆదర్శాన్ని మరీ అఘాయిత్యం చెప్పాడా అని పిస్తుంది. "తమ్ముడూ ఈ నగలు మీ వదినవేమో చూడవోయీ!" అని అడిగాడు రాముడు లక్ష్మణుణ్ణి.

"నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే,
నూపురే త్వభిజానామి
నిత్యం పాదాభివందనాత్."

"అన్నయ్యా, నాకు వదినె బాజబందులు తెలీవు. చెవుల కమ్మలు తెలీవు. నిత్యం పాదాలకు నమస్కారంచేయడంవల్ల అందెలు మాత్రం గుర్తు పట్టగలను—" అన్నాడట లక్ష్మణుడు.

సుగ్రీవునివంటి మిత్రుణ్ణి, ఆంజనేయునివంటి బంటునూ నా మటుకు నేను కోరుకుంటాను. నాకు సుగ్రీవునితో సరితూగే మిత్రులున్నారనుకోండి; అదే నాభాగ్యం! కాని బంట్లు మాత్రం లేరు.

లోకంలో ఏమి జరిగినా, తన భావనలోమాత్రం మానవుడు ఏవేవో కలుగుగంటాడు. రచయిత, కళాకారుడు ఆకలలను సౌందర్య దృష్టితో దర్శించి సుందరంగా చిత్రించినప్పుడు; తను అనుకున్నది ఎదుట ఈరూపంలో వచ్చిందిగదా అని సంతోషిస్తాడు. తాను అన్యా యాన్నో, న్యాయాన్నో చేయలేడు; కనుకఎవరైనా చేసినా, చేసి నట్లు కథవిన్నా ఆనందిస్తాడు. కళాకారుడుగూడ తను చిత్రించ దలచినదానిని, సంఘంలోని సత్తువో, అసత్తువో, సమిష్టిగాచేసి చూపిస్తాడు. దానితో శ్రోత్ర(ప్రేక్షక పాఠకుల మనస్సు రంజితమవు తుంది. దీనిని నాట్య శాస్త్రజ్ఞులు లోకధర్మి, నాట్యధర్మి అన్నారు పారిభాషికంగా. నాట్యధర్మం లోక ధర్మానికి భిన్నంగా ఉంటుంది. దానితో అకృష్టుడవుతాడు. ఈవిధంగా మానవునికి ఆదర్శం ఇష్టం. నిజానికి ఆదర్శం లేకపోతె మానవుడు ముందుకు పోవడమూ కష్టమే. ఈ ఆదర్శ వాంఛ ఏ రూపంలోనైనా ఉంటుంది. దీనిని పోగొట్టలేము. కనుక రామాయణంవంటి వాటికి ఏనాడూ ఆదరం ఉంటుంది; వాటి కళా వైదగ్ధ్యం అలాటిది.

ఇంతకూ సాహిత్యంలో ప్రమాణాలనేవి సంఘాన్ని ఆశ్రయించే ఉంటాయని, సంఘంలోని మార్పుల ఆటుపోట్లకు మారుతూ ఉంటా యని చెప్పడమే నా ఉద్దేశం. ఏమి మార్పులు కలిగినా ఆదర్శమనేది జనానికి ఆకర్షకమని మరొకమారు చెప్పడం అసమంజసంకాదు.

(నల సంవత్సరం ఉగాదినాడు ఎగ్జిబిషన్ (గౌండ్స్ హాలులో జరిగిన తెలుగు సాంస్కృతిక మహోత్సవాల గోష్ఠిలో చదివిన వ్యాసం)

# గాలం వేసే గాలులు

శ్రీ వేదుల శిరీష

నేను—
దివ్యంగా మెరుస్తూ గాలాన్ని వేసే
దీపపు కనుపాపలను చూసి;
వాటి ఆసరాతో చీకటి నైజాన్ని
దాగిన ఆశల నిజాన్ని
తెలుసుకోవాలని,
రెక్కలు కదుపుతున్నాను.

కాని !
ఆశయ ధృవాన్ని అందుకోలేక
ఆశల తీరాన్ని చేరనూలేక
కాలపువలలో చిక్కుకున్నా
జీవితపు గారడీలో ఇరుక్కున్నా
దారితెన్నులు తోచక
ఉక్కిరి బిక్కిరి అవుతూ
ఉన్నచోటే వేదన పొందుతున్నా

నాదీపం నాతోకలవనన్నది
తన వెలుగులు వేరొకరి కన్నది
అందుకే ఇప్పుడు నేను ... —
నా కోర్కెల గాలుల్ని పోగు చేసుకుంటూ
పీడకలల నీడలలో —
ఇంకా ఆశల్ని కదుపుతూనే ఉన్నాను.

# రంజనక్రియ

శ్రీ నాయుని కృష్ణమూర్తి

త్రాము నీచేలాంచలాన్ని కడసారి తాకినప్పుడు
అది యీ రాతిరంత నిదుపున నిశ్వసించిందట
నా చేతి వేళ్లు చెప్పాయి;
నిద్రతో మలచబడే రాత్రి
పిత్ర ద్రోహానికి సమకట్టింది.
ఈ రాత్రి నన్నిలా గోడకానుకొని
గొంతుకూర్చొవేలా చేస్తోంది;
యంత్రంలాంటి విధి
మనమధ్య సముద్రాన్ని త్రవ్వడానికి
పలుగూ పారా ఎప్పుడో కొనుక్కున్న
నేననుకొన్నాను—
నల్లని నీ కళ్లకు కాటుక దిద్దుతూ
ఒకరాత్రి గడిపి వేయాలని
ఆ రాత్రిలో నా జీవనం యిమిడిపోవాలని;
ఇప్పుడనుకొంటున్నాను
నువ్వు కట్టింది నల్లని చీర
నామీది అలకలో
ఒళ్లంతా నల్లని రంగుపూసుకొన్నావు,
నేనీ కాలరాత్రిని వెలితోరాసి
రాలిన పొడితో కన్నీళ్ళను రంగరించి
నీ కంటికే కాటుకగా పూస్తున్నాను.

# యుగకర్త: శ్రీ వీరేశలింగం*

శ్రీ బులుసు వేంకటరమణయ్య

ప్రజాహితాన్ని ఆకాంక్షించి వేర్వేరు రంగాలలో నిస్స్వార్థమైన సేవచేసి కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన మహనీయులు చిరస్మరణీయులు ఎందరో ఉన్నారు. కొందరు తత్త్వవేత్తలు. కొందరు సంఘసంస్కర్తలు. కొందరు ప్రజానాయకులు. కొందరు మహాకవులు. కొందరు మహావిద్వాంసులు. కొందరు అధ్యాపకులు. కొందరు పత్రికా సంపాదకులు. కాని, ఏదో ఒక రంగంలో కాక పెక్కురంగాలలో అగ్రగామియై ఆదర్శ పురుషుడై యుగకర్త అనే విఖ్యాతిని గడించిన వీరేశలింగం పంతులుగారివంటివారు మాత్రం చాలా అరుదుగానే ఉన్నారు.

అసలే అర్భకుడుగా పుట్టిన ఈయన బాలారిష్టాలకు లోనయి శ్రమపడ్డాడు. పసితనంలోనే ఉబ్బసం వ్యాధికి గురి అయినాడు. అలాగే చదువు సాగించేవాడు. బుద్ధిమంతులలో మొదటి శ్రేణికి చెందగలడు. కాని మహాప్రతిభాశాలి అని చెప్పడం సాధ్యం కాదు. అయినా ఏ మహాప్రతిభాశాలీ, కష్టనిష్ఠురాలకోర్చి పని చేసే మహా నాయకుడూ సాధింపలేని మహాకార్యాలను సాధించి అనన్య సామాన్యమైన కీర్తి ప్రతిష్ఠలు సంపాదించడానికి ఈయనకు గల ధైర్యసాహసాలూ, పట్టుదలా, ఆత్మవిశ్వాసమూ ప్రధాన కారణాలు. కొందరు వేదికలపైకెక్కి మహోపన్యాసాలిచ్చి ఇతరులకు 'ఇలా చెయ్యవలె'నని చెప్తారే కాని తాము స్వయంగా ఆచరించలేరు. చెప్పిన విధంగా చేసే ప్రేళ్లపైలెక్కించదగిన వారిలో శ్రీ వీరేశలింగంగారు మొదటివారు.

మనం ఒక శతాబ్దం వెనక్కు వెళ్ళిచూస్తే అప్పటి పరిస్థితులు కళ్లకు కట్టినట్లు కనబడతాయి. ఆర్థిక, ఆహార విషయాలలో కాకున్నా ఇతర విషయాల్లో జనసామాన్యం చాలా వెనకబడి ఉండినది. మూఢ విశ్వాసాలు అమితంగా ఉండినవి. బాలికలకు పసితనంలోనే పెండ్లిండ్లు జరుపబడేవి. వృద్ధులకు పసిపిల్లలనిచ్చి పెండిండ్లు జరపడం కూడా జరిగేది. అందువల్ల బాలవితంతువుల సంఖ్య పెరిగిపోయేది. న్యాయస్థానాలలో కూడా లంచగొండితనం సాగుతూ ఉండేది. వివాహాలు వైభవంగా జరగాలంటే భోగంమేళాలు ఉండవలసినదే! మేజువాణీలలో వస్తూళ్లంటేనే లగుమనుషులకు గౌరవం! ఇట్టి అహితకరమైన-అసభ్యమైన సంప్రదాయాలు వేళ్ళు తన్నుకున్నవి. వాటిని సమూలంగా పెల్లగించి సమాజంలో మేలైన సంస్కరణలను నెలకొల్పడానికి నిరంతరకృషి చేసి సాధించినవారిలో శ్రీ వీరేశలింగం ప్రథమగణ్యుడు. ఆ కాలంలో తెలుగుదేశంలో సంఘసంస్కర్త ఆయన ఒక్కరే అని చెప్పడం కూడా అతిశయోక్తి కాదు.

పంతులుగారి జీవిత చరిత్రలను తెలుగులోనూ ఆంగ్లంలోనూ, కూడా ఎందరో వ్రాశారు. ఎన్నో విషయాలు చెప్పారు. విదేశీయ విద్వాంసు లొకరు ఈయనను గురించి పరిశోధనలు చేసి, సిద్ధాంత వ్యాసం వ్రాసి డాక్టరేట్ పట్టాన్ని సంపాదించారు. పంతులుగారు తమ స్వీయచరిత్రలో అనేక విషయాలు చెప్పుకున్నారు. ఆయనను గురించి సమగ్రంగా తెలుసుకోవాలంటే వాటన్నిటినీ చదవాలి. అవన్నీ ఇప్పుడు లభ్యం కావు. ముఖ్యగ్రంథమైన పంతులుగారి స్వీయచరిత్ర దొరకనే దొరకదు. ఏ కొద్ది లైబ్రరీలలో మాత్రమే దానిని చూడడం సాధ్యపడుతుంది. ఇట్టి పరిస్థితిలో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన ప్రచురణలో శ్రీ వీరేశలింగం పంతులుగారి సంగ్రహజీవిత చరిత్ర వెలువడడం సముచితంగా ఉన్నది.

ఈ సంగ్రహ జీవిత చరిత్రను రచించిన డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు బహుభాషావేత్తలు. సమర్థులైన విద్వాంసులు. తమ పరిశోధనల మూలాన డాక్టర్ పట్టం సంపాదించిన ప్రతిభావంతులు. ఏ విషయాన్నయినా మొగమాటం లేకుండా ఖచ్చితంగా చెప్పే స్వతంత్రులు. చక్కని రచన సాగింపగల సమర్థులు. వీరేశలింగంగారి సంగ్రహ జీవితచరిత్ర రచనకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆయననే ఎన్నికచెయ్యడం యుక్తంగా ఉన్నది. ఆయన ఎంతో పరిశీలన చేసి, పెక్కు గ్రంథాలలోని-పత్రికలలోని విషయాలను

---

* వీరేశలింగం సంక్షిప్త జీవితచరిత్రపై సమీక్ష. గ్రంథకర్త డాక్టర్ అక్కిరాజు-రమాపతిరావు, ప్రచురణ—సమాచార పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు. డెమ్మీసైజు, 80పుటలు. వెల తెలియదు.

గ్రహించి కొలది పుటలలో ఎన్నో విషయాలను వివరిస్తూ ఒక నవలను వ్రాసినట్లు పాఠక జనామోదకరంగా దీనిని రచించారు.

ఈ పుస్తకంలో ఎనిమిది ప్రకరణాలున్నవి. అవి (1) జననం, బాల్యం, విద్యాభ్యాసం. (2) దేశకాల పరిస్థితులు. (3) సంస్కార భావాలు-తిరుగుబాటు ధోరణి. (4) వజ్రాయుధంవంటి పత్రిక. (5) సాహిత్యవికాసం (6) వీరసంస్కర్త. (7) యుగపురుషుడు. (8) ఉత్తమా ఇల్లాలు. ఇవి కాకుండా మూడు అనుబంధాలు కూడా చేర్చబడినవి.

మొదటి ప్రకరణంలో అతని శైశవం ఎలా గడిచినదీ, విద్యాభ్యాసం ఏ రీతిని జరిగినదీ, అప్పుడు అతనికి వాఙ్మయంపై ఎటువంటి ఆసక్తి ఏర్పడినదీ తెలుపబడింది. ముఖ్యంగా అతని సత్యసంధత మెచ్చుకోదగినది. రెండవ ప్రకరణంలో అప్పటి చాదస్తాలు, అతిబాల్య, అననురూప వివాహాల ఫలితాలు, స్వార్థపరత్వం, లంచగొండితనం, మూఢవిశ్వాసాలు, అవినీతి సంఘసంస్కర్తలను గురించిన అధిక్షేపణలు వివరించబడ్డాయి. అప్పటిలో వీరేశలింగంగారికి కలిగిన అభిప్రాయాలు వీనివల్ల తెలుస్తున్నవి. అసమర్థుడైన తమ హైస్కూలు హెడ్మాష్టరును అక్కడినుంచి బదిలీ చేయించడంకోసం ఇతడు విద్యార్థులకు నాయకత్వం వహించి, సమ్మె చేయించి కృతార్థుడు కావడం ఇతని తిరుగుబాటు ధోరణికి ప్రబల నిదర్శనం. ఇది మూడవ ప్రకరణ లో తెలుపబడినది. ఆ ప్రకరణంలోనే స్త్రీ విద్యనుగురించి కొక్కొండవారి 'ఆంధ్రభాషా సంజీవని'లో వ్రాసిన దానికి 'పురుషార్థ ప్రదాయిని'లో ఈయన ఇచ్చిన సమాధానం, భూతవైద్యుడికి బోధించిన గుణపాఠం వీరి సంస్కరణాభిలాషకు గొప్ప తార్కాణ.

సంఘసంస్కరణలో తన ఆశయాల ప్రచారానికి, అవి కార్యరూపం దాల్చడానికీ పత్రిక ఒకటి అవసరమని తోచి, శ్రీ వీరేశలింగం "వివేకవర్ధని" అనే మాసపత్రికను ప్రారంభించారు. అది సంఘంలోని దురాచారాలను తీవ్రంగా విమర్శించడమే కాక, ప్రభుత్వాధికారుల లంచగొండితనాన్ని కూడా నిర్భయంగా విమర్శించేది. ఇది ఆయన ఆశయ ప్రచారానికే కాకుండా సొంత కవితలనూ, ప్రాచీన ప్రబంధాలనూ ప్రచురించడానికి కూడా మిక్కిలి సాయపడింది. పంతులుగారి గ్రంథాలు చాలా మొదట ఈ పత్రికలోనే ప్రకటించబడేవి. ఈ విషయాలు నాల్గవ ప్రకరణం 'వజ్రాయుధంవంటి పత్రిక' అనే శీర్షికలో వివరింపబడినవి.

తర్వాతి ప్రకరణమైన 'సాహిత్య వికాసం'లో పంతులుగారి బహుముఖ సాహిత్యసేవ ప్రశంసింపబడింది. తెలుగు వాఙ్మయంలో ఆయన నూతన యుగాన్ని స్థాపించారు.

ఆయనయే...

"నే నారంభించిన కాలమునందు తెలుగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములు లేవు. వివిధము లేమి? ఇంచుమించుగా నే విధమైనవియు వచనరూపమయినవి లేవనియే చెప్పవచ్చును. అప్పు డన్నియు నూతనసృష్టి చేయవలెను. అందుచేత నప్పటివారికి కష్టము లెక్కువ. సౌలభ్యములు తక్కువ. అయినను తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకై మొదటి వచనపుస్తకమును నేనే రచించితిని" అని చెప్పుకొన్నారు.

పంతులుగారి వచనప్రబంధ (నవల) రచనకు ముందు శ్రీ నరహరి గోపాలకృష్ణమ్మసెట్టి 'రంగరాజ చరిత్ర', నాటక రచనకుముందు కోరాడ రామచంద్రశాస్త్రిగారి నాటకానువాదం లేకపోలేదు. కాని, అవి ఆయనదృష్టిపథంలో పడకపోవచ్చు. పడి అయినా ఉండకపోవచ్చు. రంగరాజచరిత్ర నవల కూర్పునకు ప్రారంభదశ కావచ్చు. కాని నవల అని చెప్పుకోదగిన వాటిలో రాజశేఖర చరిత్రయే మొదటిదని చెప్పవలసి ఉన్నది. నన్నయకు పూర్వం కవిత్వమున్నా, ఆదికవి అనే కీర్తి అతనికే లభించినట్లు రాజశేఖర చరిత్రకే

లోరి నవల అనే ఖ్యాతి లభించింది. ఆ కాలంలో వెలువడిన నాటకాలలో ఆయనవే ప్రశస్తాలని పేరు తెచ్చుకున్నవి. అన్ని వాఙ్మయ శాఖల్లోనూ ఆయనే మార్గదర్శకులైనారు. ఇంతెందుకూ? ఆరంభవిద్య మొదలుకొని ఆచార్య పట్టం పొందేవరకూ అన్ని తరగతుల విద్యార్థులకూ ఉపయోగపడే పుస్తకాలనే ఆయన వ్రాశారు. మాక్మిలన్ కంపెనీవారి తెలుగు వాచకపుస్తకాలు ఈ మార్సడన్ దొరగారిచే రచించబడి, వీరేశలింగం పంతులుగారిచే సరిచూడబడినట్లు ఉన్నా, వాస్తవానికి వాటిని రచించినవారు పంతులుగారే అని పాఠాల శైలిని బట్టి పాఠాల చివర సారాంశంగా ఇయ్యబడిన పద్యాలనుబట్టీ మనం తెలుసుకోవచ్చు. పంతులుగారు అష్టావధానాలు చేసినట్లూ, వాటివల్ల తలనొప్పి తప్ప వేరే ప్రయోజనం కానరానందున ఆ తర్వాత విడిచిపెట్టినట్లూ రచయిత ఈ ప్రకరణంలో వివరించారు. పిల్లలకూ, స్త్రీలకూ ఉపయోగించే ప్రత్యేక పుస్తకాలూ, వ్యాకరణ తర్క, అలంకారాది శాస్త్రాలలో బహుజనోపయోగకరంగా వ్రాసిన సంగ్రహ గ్రంథాలూ పంతులుగారివే ప్రచారాన్ని పొందాయి. వారి స్వదేశ సంస్థాన చరిత్ర, కవుల చరిత ప్రత్యేకంగా పేర్కొనదగినవి. పత్రికలో కొద్దికొద్దిగా ప్రకటితమైన ప్రాచీన గ్రంథాలే తర్వాత పుస్తక రూపంలో వచ్చాయి.

'వీరసంస్కర్త' అనే ఆరవ ప్రకరణంలో అధికారులలోని లంచగొండితనాన్ని అరికట్టడానికీ, తాను సంకల్పించిన విధవా వివాహాలు జరపడానికి ఎన్ని కష్టాలకోర్చినదీ, పట్టుదలతో ఎలా సాధింపగలిగినదీ విపులంగా చూపబడింది. సంస్కర్తలు ఎందరో ఉండవచ్చును.

కాని ఎన్నో అడ్డంకులు కలుగుతున్నా, నిరుత్సాహపడక ధైర్యసాహసాలు కృతార్థులైన పంతులుగారివంటి వారే వీర సంస్కర్తలనే విఖ్యాతికి తగినవారని ఈ శీర్షిక సూచిస్తున్నది.

'యుగపురుషుడు' అనే శీర్షికలో పంతులుగారి యుగ పురుషత్వం సమర్థించబడింది. వివిధ సాహితీరంగాలలోనే కాక, సంఘ సంస్కరణలోనూ నూతన శకాన్ని ఆయన స్థాపించిన వివరాలిందులో ఉన్నవి. ఈయన పట్టుదల మనిషి అయినా మొండిపట్టు పట్టే స్వభావం కాదు. మొదట్లో వ్యావహారిక భాషను వ్యతిరేకించినా, గిడుగు రామమూర్తి పంతులుగారి వాదాన్ని అవగాహన చేసుకుని ఆ వాదాన్ని ఆమోదించారు. వ్యావహారికోద్యమాన్ని ప్రచారం చెయ్యడానికి స్థాపించబడిన వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజానికి ఈయన అధ్యక్షులయినారు.

'వీరేశలింగాన్ని ఆదర్శంగా పెట్టుకొని నేనెన్నో నేర్చుకొన్నానని ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారే—ఈయనను కొల్చుకు ఎక్కించినవారే వ్రాశారంటే—దానివల్లనే వీరి ఘనత వెల్లడి అవుతున్నది.

పంతులుగారివంటి సంఘ సంస్కర్త జాతిమత భేదాలను పాటించక పోవడంలో ఏమీ ఆశ్చర్యంలేదు. ఈయన ఏకేశ్వరోపాసకులై రాజా రామమోహనరాయలు స్థాపించిన బ్రహ్మసమాజాన్ననుసరించి జందెమును తీసి పారవేశారు. బ్రాహ్మమతావలంబకులకు అనేక మందికి ఆదర్శపురుషులైనారు.

ఎంత గొప్పవ్యక్తి కయినా మరొకరి అండదండలు అవసరమే! మరెవ్వరూ సహాయపడకపోయినా బాధ లేదు. కాని తన జీవితంలో సగం వంతు పంచుకునే గృహిణి సహాయం లేకపోతే అలాటి ఆదర్శాలు నెరవేరడం దుర్లభం. ఆమె తనతోకూడా వేదికపైకి ఎక్కి ఉపన్యాసాలియ్యనక్కర్లేదు. తనతో కలిసి పనిచెయ్యనక్కర్లేదు. తన పనిలో జోక్యం కలుగజేసుకోకుండా ఉంటే - అడ్డు పడకుండా ఉంటే ఆదే గొప్ప సహాయం. తాను తన పనులమీద తిరిగి తిరిగి శ్రమపడి ఇల్లు చేరుకొనేసరికి ఇంట్లో పోరు, కలతలు చెలరేగితే సగం ఉత్సాహం పశిస్తుంది. ఎంత దృఢమనస్కుడైనా ఏమీ సాధించలేకపోతాడు. పంతులుగారి భార్య రాజ్యలక్ష్మమ్మగారు ఆయనకు అన్నివిధాలా అనుకూలంగానే ఉన్నందున ఎటి చీకూ, చింతా ఆయనకు ఉండేదికాదు. ప్రాచీనాచార పరాయణలైన మహిళలు బోధించినా ఆమె వాటిని వినక "ఆయనమాటే నాకు సర్వస్వం" అని సమాధానం చెప్పేది. ఆ దంపతులకు పరస్పరం ఎట్టి ప్రగాఢమైన ప్రేమఉన్నదీ ఈ ప్రకరణంలో వివరించబడి ఉన్నది. ఉత్తమ ఇల్లాండ్రలో ఆమె ఉత్తమ స్థానాన్నే ఆక్రమించుకున్నది.

ఈ పుస్తకానికి ఎంత విలువ ఉన్నదో దీని అనుబంధాలకూ అంత విలువ ఉన్నది. ఆయన జీవితంలో కొన్ని ముఖ్య ఘట్టాలను తెలిపే మొదటి అనుబంధం సంవత్సరాల వారీగాఉన్న ఆయన సంక్షిప్త జీవిత చరిత్రే అని చెప్పాలి. అది చదివితే ఒక్కసారిగా ఆయన ఘన కార్యాలు స్ఫురణకు వచ్చి, ఆయన మహావ్యక్తిత్వం కళ్లకు కడుతుంది. రచనాక్రమానుసరించిన ఆయన రచనల పట్టిక కూడా ఇందులో చేర్చబడి ఉన్నది.

రెండవ అనుబంధంలో పంతులుగారి మిత్రులు కొందరూ, వారు చూపిన మైత్రీ సంగ్రహించబడినవి. మిత్రులతోపాటు శత్రువులూ ఇందు పేర్కొనబడ్డారు. తొలుత మిత్రులుగా ఉండి తర్వాత అభిప్రాయభేదాలవల్ల విడిపోయినవారూ ఇందులో ఉన్నారు. తాను నమ్మినవారు తన్ను విడిచిపెట్టినా, తాను తన ఆదర్శాన్ని విడిచిపెట్టక

ధైర్య సాహసాలతో వీరేశలింగంగారు చిక్కు సమస్యలను ఎలా ఎదుర్కొన్నదీ ఈ పట్టికవల్ల తెలుస్తున్నది.

శ్రీ పంతులుగారు పరమపదించినప్పుడు శ్రీ సి. ఆర్. రెడ్డిగారు ఆంధ్రపత్రికకు పంపిన సానుభూతి సందేశం మూడవ అనుబంధంగా ఇవ్వబడింది. రెడ్డిగారు నిక్కచ్చి మనిషి. ముఖస్తుతులు ఆయనకు కిట్టవు. మొగమాట మనేది లేదు. ఆయన అందులో ఎన్నో విషయాలు తెలుపుతూ చివరకు "వీరేశలింగము పంతులుగారి వంటి దేవతలను భారతదేశ మెప్పుడు మరచిపోయిన అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైనదనియే చెప్పవచ్చును" వ్రాసిన ఒక్క వాక్యమే ఆయన మహనీయతను తెలుపుటకు చాలును.

ఏదో ఒక వెల నిర్ణయించి ఈ మంచి పుస్తకం అందరికీ అందేటట్లు చేస్తే ఎంతో బాగుండేది.



## శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

పాలకడలిలాంటి
కాలకూట విషంలాంటి
విరిగుత్తివంటి — చురకత్తివంటి
లలనా!
తల్లీ! చెల్లీ! ప్రియతమా!
అవని దరహాసమా! రమణీ

ఆరు ఋతువుల అసలైన స్వరూపానివి
ఎడి ఆరని వినూత్న కావ్యానివి
సహనానివి — విరహానివి.

నీ నేత్రయుగ్మంలో ఒకటి
నిరంతర శీతల చందన పాలిక
మరొకటి సంతత భీషణ జ్వాలిక.

నువ్వు నవ్విన జాడలు
మల్లెలై గుబాళిస్తాయి—
నీ అధరాల ఒలికే మాటలు
గులాబులై పల్లవిస్తాయి.

నీ కన్నీటి ఆణిముత్యాలు
హేమంత గృహ ప్రాంగణంలో —
హరిత శాద్వలాలమీద పరచుకున్న
తుషార బిందులు.

నీ నేత్రాంచలాలమెరిసే అనురాగహేల
మానవాళికి శాంతిని ప్రసాదించే
సుందర కవోష్ణ జ్యోత్స్నల.

విద్యుత్ప్రవాహమా!
జ్వాలత్సౌందర్యమా!
చలచ్ఛృంగారమా!

ప్రకృతిలో మొదటి జీవి ఊపిరికి
స్తన్యమిచ్చి చిరంజీవిని చేసిన
కరుణామయీ! కన్నతల్లీ!

ప్రశాంత సదనాలవంటి
ఏకాంత స్వర్గాలవంటి — నీ కళ్లలో
యుగయుగాలు ఉయ్యాలలూగుతాను —
నిన్ను అర్థంచేసుకోవాలని ప్రయత్నించి
పరాజిత కేతనంలా నేలకొరిగిపోతాను
నీ పాద చిహ్నాలు వెతుక్కుంటాను.

# రససిద్ధి

శ్రీ పణతుల రామచంద్రయ్య

నిప్పు రవ్వలు ఊరుతాయనుకున్న ఘట్టాల్లో
సవ్వడి లేకుండా రగులుతోంది చల్లదనం.
అణగారే ఉద్రేకాల కొలిమి ఇక ఊదకు —
అయిపోతోంది ఇంధనం.

కథ కంచివైపు నడిచేలోగా,
వ్యధిత పాత్రలు గండాన్ని గడిచేలోగా,
ఆసక్తిని పెంచటానికై పిలిపించిన తికమకల్ని మళ్లీ
యవనిక చాటుకు తీసుకెళ్లి విడిచేలోగా,
సర్వమూ తలకిందులు కావచ్చు
క్షమాపణ చెప్పే వ్యవధి దాటిపోవచ్చు.

విన్నో వైశాల్యాలను యుగయుగాలుగా వడపోసి
ఈ వృత్తాంతాన్ని ఎన్నిక చేశానని
ఏ అనిర్వచనీయతనో అల్లిక చేశానని
మురిశావు కాని —
నీవు నిల్చున్న చోటును చూడు.
అది భావనా నిదాఘ నిరంతరత్వంలో
వాడిపోయిన వీడు.

హోమర్, వ్యాసుడూ, వాల్మీకీ,
యూరిపిడిస్, కాళిదాసూ, ఓనీల్
అనుశ్రుతంగా ఆకర్ణించిన
వైవిధ్యంలేని దీర్ఘ వేదనా గానంతో
విస్తరించిన వీడు.

ముందే చెప్పాను నీకు లోబడని ముగింపును గురించి
అందమైన సూచనలు అందించ వద్దని.
'అంతా నిత్యకల్యాణం పచ్చతోరణం' అంటూ
భ్రాంతి మదలంకారాల్ని కల్పించవద్దని.
అశుభం శుభం తెలియని భావుకుడివి నువ్వు.
అనవసరంగా శోకాల్ని రెచ్చగొట్టిన
కథకుడివి నువ్వు.

పువ్వుల్లాంటి ఆడపిల్లలు హోలీ పకాలాడబోయే సన్నివేశం
బురద బురదగా వుంది.
స్నేహోష్మరా సేవ్యమని భ్రమించిన నేపథ్యం
చిరాకెత్తిస్తోంది.

నీడనిచ్చే నమ్మకాల్ని పెళగిస్తూ సుడిగాలులు —
లోడై వచ్చే సంప్రదాయాలపై పిడుగులు —
గగనం వైపు చూడకు — దేవుడికే లేదు పరపతి.
సగటు ప్రాణికి పోయింది మతి

ఇక ఎవరికి మొక్కుతావు? ఏ దారులు తొక్కుతావు?
ఈ తుఫానులో ఏ తలుపులకు నగిషీలు చెక్కుతావు?

కానీ తప్పదు —
కథ వెనక్కి నడిపిస్తానంటే జనం ఒప్పదు
మునుపటిలా ప్రకృతిలో స్నేహం నెరపలివాడైనా,
మనిషికి జై కొట్టక తప్పదు

పన్నుగడ మార్చు.
ప్రచ్ఛన్నంగా అక్షరాల్లో కదిలే మెత్తదనాన్ని పరిమార్చు
కొత్తగాలుల్లో కొట్టుకొచ్చిన ప్రశ్నల్నించీ
సలా పీల్చుకునే జీవితాల్ని తీర్చు.
పరిసరాలతో రాజీపడే పాత్రల్ని
బహిరంగంగా బహిష్కరించు.

ఇక భయం లేదు.
ఈ సంకల్పాల గాఢత్వానికి తడిసోకదు.
నువ్వు ఊహించిన పారవశ్యాల దరికి చేరలేకున్నా,
నవ్వులమధ్య భరతవాక్యం పాడలేకున్నా,
ఈ నిరాశలో సృష్టివుంది — నిరాకరించకు.
ఈ విషాదంలో డ్రామావుంది — చేజార్చుకోకు.
అప్పుడే ఆవేశాల ప్రక్షాళనం —
అప్పుడే రసప్రసారణం.

# కాలం మారిపోయింది

## శ్రీ కాసల నాగభూషణం

"ఇంక మనం వెళదామా ?" అంటూనే నా భుజంమీద చెయ్యి మోపి, నిటారుగా లేచి, కపిలతీర్థం గుడివేపు చూస్తూ నిలుచున్నాడు రాంబాబు.

"అప్పుడేనా! వెన్నెలరానీ" అని నేను వాని చేతిని పట్టుకుని ఒక్క కుదుపుతో కిందికి లాగాను. ఇసుకలో దబ్బున కూలబడ్డాడు రాంబాబు.

అప్పటి వేళావిశేషమేమో కాని తన మాటని చెల్లించుకోవాలనే పట్టుదలతో తొందరగా వెళదాం రమ్మని వాడు నాలో పేచీ పెట్టుకోలేదు. మనసులో నన్ను తిట్టుకున్నా ఎదుటికిమాత్రం బుద్ధిగా కూచుని చిన్నపిల్లాడిలా ఇసుకని కొంతమేర పోగుచేసి ఓ మోస్తరు రాళ్లనేరి దాని చుట్టూరా కోటలా పేర్చుకుంటోన్నాడు.

వాణ్ని చూసి ఒక్కమారు నాలోనేనే నవ్వుకుని, పడమటి దిక్కుగా అస్తమిస్తోన్న సూర్యుడికేసి చూపు ప్రసరించాను.

అలా చూస్తోండగానే సూర్యుడు ఎర్రగా మారాడు.

పడమటి కొండలమీది మబ్బుల చివర్లలో చిక్కుకున్న ప్రభాకరుని పచ్చని కిరణపుంజం సన్నని జరీ అంచులా నిగనిగలాడుతోంది. మరి కాసేపటికి పరిణతమైన సూర్య కిరణాలతో ప్రకృతి పసుపు రంగులోకి మారింది. నింగి నేలని తాకుతోన్నచోట్నల్లా నీలిమ ఎక్కువవుతోంది. మబ్బులు చీకటి ముద్దల్లా తయారవుతోన్నాయి.

ఒళ్లంతా పసుపు రాసుకుని, తలంటుపోసుకుని కురులారబెట్టుకుంటోన్న పడుచుపిల్లలావుంది సంధ్య! నాకు తెలియని ఆనందంతో అలానే చూస్తోండిపోయాను సంధ్యకేసి!

"ఓ...శర్మగారా! రండి...రండి..." రాంబాబుకంఠంవిని, తలతిప్పి వానివైపు తిరిగాను.

"ఏమిటి? ఇక్కడ కూచున్నారు ఏకాంతంగా" మా ఇద్దరినీ సమీపిస్తూ ఒక వయస్సు మళ్లిన వృద్ధుడు నవ్వుతూ ప్రశ్నించాడు రాంబాబుని.

"ఏకాంత మేమిటండీ? ఇక్కడున్నది ఇద్దరూ మగవెధవలే మైతే."

ఇదీ రాంబాబు సమాధానం. ఒకవేళ ఆ వున్నది ఇద్దరే అయినా ఆడా మగా అయితే అది ఏకాంతమే అని అందులో వాడి ధ్వని!

మొత్తానికి ముసలాయన దగ్గర రాంబాబుకి చాలా చనువున్నట్లు గ్రహించాను.

మాతో వొచ్చి కూచున్న తర్వాత అతనికి నన్ను చూపెడుతూ నా పేరు చెప్పి పరిచయం చేశాడు రాంబాబు.

నేనతనికి నమస్కరించాను.

"ఈయన పేరు సుబ్రహ్మణ్యశర్మ. ఈమధ్యనే పరిచయమయ్యారనుకో. ఎదురుగా వుంచుకునే చెప్పడం మంచిది కాదుగాని చాలా మంచివారని ఈ కొద్ది రోజుల్లోనే తెలుసుకున్నాను." ఈ పరిచయ వాక్యాలలో తన బాధ్యత తీరిందన్నట్లు రాంబాబు అతనితో సావకాశంగా మాటల్లోకి దిగాడు.

మధ్య మధ్య ఆయన బోసినోటితో నిండుగా నవ్వుతోన్నాడు. బొద్దుగావున్న శరీరం. గోచీపోసి కట్టిన తెల్లని పంచె, పల్చని లాల్చీలోంచి పొట్టమీద స్పష్టంగా కనబడుతోన్న సన్నని జంధ్యం. భుజంమీద ఎర్రని అంచు పైకి వచ్చేటట్లు మడిచి వేసుకున్న అంగవస్త్రం. నుదుట చందనపు బొట్టు. సగానికి సగం నెరసినా నాజూకైన సిగముడి. సలక్షణమైన బ్రాహ్మణతేజం ఉట్టిపడుతోన్న ఆకారం సుశర్మగారిది.

వినీ విననట్లు ఒకటీ అరా వాళ్ళ మాటల్ని వింటూనేవున్నా నిజానికి నేను వినడం లేదనే చెప్పాలి. ఆయనకీ, రాంబాబుకీ స్నేహం ఎలా కుదిరిందా అనే నేనప్పుడు ఆలోచిస్తోన్నాను. సమవయస్కుల మధ్యనేగాని స్నేహం అనురాగంగా వుండదనేది అందరూ అనుకుంటోన్న యథార్థం. కాని రాంబాబు ఆయనతో సన్నిహితంగా ఉంటూ కొంతలో కొంతగా ఆ మాటని సవరించాడు. పైపెచ్చు ఆయనని 'మంచివారు' అని సర్టిఫై చేశాడు.

రాంబాబుతో నాకున్న స్నేహాన్నిబట్టి ఆ 'మంచి' అనే పదానికి

వాని దృష్టిలోవున్న అర్థాన్ని కూడగట్టుకున్నాను. ఫలితంగా తేలిన అంశం ఇది.

ఒక అందమైన గాజుబొమ్మని ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకుని, పొరపాటున జారవిడిచి, పగిలిన ఆ గాజుముక్కలకేసి చూస్తూ, అమాయికంగా ఏడిస్తే ఆ పిల్లవాణ్ని చేరదీసి "మా మంచి బాబువికదూ! పోనీరే...ఏడవకు. మరొకటి కొనుక్కుందాం" అని లాలించగలడు రాంబాబు. మరి ఈ సుబ్రహ్మణ్యశర్మగారుకూడా ఆ పిల్లవాని వంటివారేనా ? ఏమో !

"ఏమిటి? మీరేం మాట్లాడక్కూచున్నారు." శర్మగారు ప్రశ్నించారు నన్ను.

"మీరు మాట్లాడుతోన్నారుగా. అవే వింటోన్నాను." వెంటనే ఏం చెప్పాలో తోచక ఏదో వొకటి చెప్పకుంటే బావుండదు గనక అలా అన్నానతనితో.

"సరే, గుడికి వెళదామా? కపిలతీర్థంవైపు చూస్తూ సుశర్మ అడిగారు మమ్మల్ని.

"మరి వెళ్ళక! వచ్చిందే అందుకయితే" పచ్చి అబద్ధం చెప్పాడు రాంబాబు. అయినా ఎదుటి వ్యక్తినీ, పరిస్థితినీ అర్థంచేసుకుని ఎవరిని ఎలా సంతృప్తిపరచాలో అన్నదికూడా ముఖ్యమేనని అనిపించింది నాకు—వాని మాటని విన్నతర్వాత. లేకుంటే గుడికి శర్మగారిలాంటి వాళ్లెందుకు వొస్తార్రో, మాలాంటి వాళ్లెందుకువస్తార్రో అందరికీ తెలిసిన విషయమే. భక్తితో రక్తిని అంత పొందికగా అదికించాడు రాంబాబు.

చేతుల కంటుకున్న ఇసుకని దులుపుకుంటూ లేచిన రాంబాబుతోటే నేనూ, శర్మా లేచి నడక సాగించాము.

ఆ రోజు సోమవారం. ముఖ్యంగా పున్నమి. ఆ పండువెన్నెలలో తిరుమల కొండల పరిసర ప్రాంతాలు ఎంత దివ్యంగా వుంటాయో నేనిప్పుడు మాటల్లో చెప్పలేను. అందుకనే ఏ సోమవారాన్నీ, ఏ పున్నమి రాత్రినీ విడిచిపెట్టకుండా నేనూ, రాంబాబూ ఆ వేళకి కపిలతీర్థాన్ని చేరుకుంటాం. అందులోనూ ఆ రెండూ కలిసొచ్చిన ఆ రోజున మా ఆనందానికి అవధులులేవు.

ఎవరికివాళ్లే మౌనంగా నడుస్తూ మేము ఇసుకబాట వదిలి, నీలగిరి చెట్లు దాటి ఆలయానికి చేరుకున్నాము

సుశర్మకైతే ఆ బెడద లేదుగాని మాకెదురయింది చెప్పుల ప్రశ్న! ఆలయ ప్రాంగణం వెలుపల, శిథిలమైన గోపురం ప్రక్క కాపలావున్న పిల్లవాడిదగ్గర నేనూ, రాంబాబూ చెప్పులు విడిచాము.

సుశర్మ సరాసరి వెళ్లి క్యూలో చేతులు కట్టుకుని నిలబడ్డారు. మేమూ ఆయన్ని అనుసరించాము.

అప్పుడే తిరుమలకు వెళ్లే కాలిదారి పొడవునా లైట్లు వెలిగాయి. చిన్న చిన్న అగ్గిపెట్టెల్లా దేవస్థానం బస్సులు అలిపిరినుండి మొదలయ్యే ఘాట్ రోడ్ వెంబడి వెళ్లివస్తోన్నాయి. అలా కొండ మొదట్లో నిలబడి. తల మీదికెత్తి మెలికలు తిరిగిన పాములాంటి ఆ రోడ్డువెంట ఎక్కడికక్కడ మలుపులు తిరుగుతో పరుగెత్తే బస్సు అవి చూస్తే ఎవరికైనా గుండెలదిరిపోతాయి.

అంతకు వారంరోజులనుండే వర్షాలు పడడంవల్ల కపిలతీర్థంలో సన్నగా జల పడుతోంది. రాళ్లమీద దొర్లుకుంటూవచ్చి అంత ఎత్తునించీ దూకడంవల్ల కలిగే శబ్దం లయబద్ధంగా వినవస్తోంది.

క్యూ కదిలింది. కొంతసేపటికి గర్భగుడిలో ప్రవేశించాము, సర్ప కవచంతో కప్పిన శివలింగాన్ని నాగుమల్లి పువ్వులతో అలంకరించారు.

సుశర్మగారు భక్తితో తీర్థాన్ని పుచ్చుకున్నారు. విభూదిని తీసుకుని కనుబొమలమధ్యా, కంఠానికీ రాసుకున్నారు. మావేపు చూశారు తీర్థం, ప్రసాదం మాకూ తప్పేదికాదు!

అలాగే ఆ గుడి పక్కనేవున్న అమ్మవారి దర్శనం చేసుకుని, నవగ్రహాల గుడిమీదుగా వెలుపలికి వచ్చాము. మెట్లు దిగి కోనేటి గట్టును చేరుకున్నాము.

తెల్లగా, పురవడిగా అంతర్లయతో దుముకుతోంది జలపాతం. ఆలయానికి నడుమమున్న వేపచెట్టుమీద తనలో తానే కువకువలాడుతోంది నెమలి. కోనేటి నీళ్లలో ప్రతిఫలించి చేపపిల్లల్లా మిలమిల మెరుస్తోన్నాయి గోపురంమీది లైట్ల వెలుగులు. అందాన్ని అలంకరించిన గర్వంతో పిల్లగాలికి రెపరెపమంటున్నాయి రంగురంగుల చీర కొంగులు!

వీటివన్నింటినీ పాలవంటి వెన్నెలతో అభిషేకించి తన సౌందర్య సేవా పరత్వాన్ని సార్థకపరుచుకుంటోన్నాడు పున్నమి చంద్రుడు!

ఆ దృశ్యాన్ని చూచి, పైమరచి ఏ మా రాంబాబులాంటి వాళ్లో "ఎగ్జిబిషన్ ఆఫ్ బ్యూటీ" అని ఎగిరి గంతేసినా అందుకు ఆశ్చర్యపోనక్కర్లేదు మనం. అయినా ఆ రోజున అంతటి మా ఆనందానుభవానికీ మే మెక్కువసేపు నోచుకోలేకపోయాం. ఏదో ఆలోచ

నలో తలవొంచుకుని నడుస్తోన్న శర్మగారినే అనుసరించవలసొచ్చింది.

అలా ఆ శిధిలాలయాన్ని దాటి ఆయన వెనకాలే రెండడుగులు వేశానో లేదో రాంబాబు తక్కున నా జబ్బ పుచ్చుకుని నిలేశాడు. నాకు మాత్రమే వినిపించేట్టు "చెప్పులా నాయనా! చూపులు శివుడిమీద, చిత్తం చెప్పులమీద అన్నది సరికొత్త సామెత. వాటినే మరిస్తే ఎలా?" అంటూ నన్ను వెనక్కి మళ్లించాడు.

మళ్లీ వెనక్కు వెళ్లి, కాళ్లకు చెప్పులు తొడుక్కుని ఆయన్ని కలుసుకున్నాము. మామధ్య ముసురుకున్న ఐదారు నిమిషాల మౌనం మమ్మల్ని నింపాదిగా ముందుకు నడిపింది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో స్పష్టంగా వినవస్తోన్న మా కాలి చెప్పుల టకటకల్ని వింటోన్నట్టుగా కాసేపు నేలకేసి చూసి శర్మగారిలా అన్నారు: "పోయాయి రాంబాబూ! ఆ మంచిరోజులు ఇకరావు."

మొట్టమొదట తగ్గు స్థాయిలో ప్రారంభమై మెల్లగా గళం విప్పుకుని వినవచ్చిన ఆ మాటల్ని "ఇంతసేపూ మథనపడిన విషయాన్నే వెళ్లగక్కే ప్రదేశంలో ప్రథమ ప్రయత్నం చేస్తోన్నారీయన" అని అనుకున్నాను నేను.

అదేమిటో అర్థంకానట్టు రాంబాబు ఆయనవైపు చూశాడు

"అవును రాంబాబూ! దైవభక్తి, పాపభీతి వున్న ఆరోజులు వెళ్లిపోయాయి. చూడండి బాబూ! మిమ్మల్నొక టడుగుతాను. సంకోచించకుండా సూటిగా సమాధానం చెప్పండి. దేవునిమీద నమ్మకం వుందా?"

ఈ ప్రశ్నకు సమాధానం నానుంచే వినాలన్నట్టుగా ఆయన నన్నే ప్రత్యేకించి చూస్తూ అడిగారు. నేను నిర్భ్రాంతుణ్ణయ్యాను.

ఎందుకంటే అప్పుడు మేమున్న ఆ వాతావరణంగానీ, అంత వరకూ రాజ్యంచేసిన శర్మగారి మౌనంగానీ వారిచేత అలాంటి ప్రశ్నని వేయిస్తుందని నేనెదురు చూళ్లేదు. అందునా ఆ ప్రశ్నే అంతటి చిక్కు ప్రశ్నే!

నాలో కలకలం బయలుదేరింది.

దేవునిమీద నమ్మకం లేదనడం ఆధునిక నాగరికతకొక గుర్తు! దేవుడున్నాడని నమ్మి పూజలూ, పునస్కారాలూ చేసేవాళ్ళంతా అనాగరికులకిందే లెక్క. తనదైన వ్యక్తిత్వాన్ని మరుగుపరుచుకుంటో, సంఘానికి కావలసిన వ్యక్తిత్వాన్ని ప్రచారం చేసుకుంటో బ్రతికే విద్య ఈ రోజుల్లో దాదాపు అందరికీ అలవడింది. నిజానికి శర్మగారు నన్నడిగిన అదే ప్రశ్నని ఆలోచనా సరళిలో ఇండియాని పలో వెయ్యేళ్ళు ముందుకి తీసుకుపోతున్నామని చాటుకునే పెద్ద మనిషినే గనక అడిగితే ఆయన బ్రహ్మాండమైన పోజొకటి కొట్టి "అసలు దేవుడంటే..." అనో, మరింకో రకంగానో గొంకతిరుగుడు సమాధానాన్నివ్వడనికో మార్గాల్ని వెదికేవాడు. అలా కాకుండా ఆ ప్రశ్న వున్నంత సూటిగానే నా సమాధానమూ వుండాలని తిన్నగా శర్మ గారితో ఇలా అన్నాను:

"మీరడిగిన ప్రశ్న లాంటి కుర్రవాళ్ళు సమాధానం చెప్పదగిందికాదు శర్మగారూ! ఇక్కడ జవాబు చెప్పదగిందికాదు అని వేటాటోన్నానంటే ఏదో ఒక సమాధానం చెప్పలేకపోయికాదు. కానీ ఆ చెప్పేదానికీ, మా ఆచరణకీ సంబంధం వుండాలి గనక చెప్పలేకపోతోన్నాను. పోతే మతమూ, దేవుడూ అనేవి అసలు మానవ జాతినే విడిచి పెట్టేవేమో అనిపిస్తోంటుంది నాకు. ఏ దేశ భాషా సంస్కారాలవల్ల మత మౌఢ్యమనీ, ఆస్తికత్వం అనర్థ కల్పనమనీ మనం గుర్తింపగలిగామో ఆ దేశాలే, ఆ దేశభాషా సాహిత్యాలే వాని తాలూకు అవశేషాన్నైనా పట్టుకుని ఇంకా వేలాడులోనే వున్నాయి. తమ మత ప్రచారంకోసం చేతనైనంత ప్రయత్నాలూ చేస్తోన్నాయి."

చెబుతోన్న మాటల్ని ఆపి శర్మగార్ని చూశాను. ఆయన సా

ధానంగానే వింటూ, ఆలోచిస్తోన్న వారిలాగానే కనిపించారు. అలాగే రాంబాబువేపూ ఓమారు చూసి మళ్ళీ చెప్పడం ప్రారంభించాను.

"నన్నడిగితే శర్మగారూ! తొలినాళ్లలో మనిషి ఏం చేసినా సంఘాన్నీ, దాని భద్రతనీ దృష్టిలో వుంచుకునే చేశాడు. దాని ఫలితమే ఈ పాపపుణ్యాలూ, దేవుడూను. ఎక్కడో చదివాను, మనిషి చేసిన ఒకే ఒక్కమంచిపనీ దేవుడున్నాడని కల్పించడమే-అని. ఇక్కడ మనం 'కల్పించడం' అన్నదాన్ని గుర్తుంచుకోవాలి. మరి మన కాలంలో సంఘపరంగా సంస్కర్తలని పేరుపొందినవాళ్లె వ్యక్తిగతంగా ఆధ్యాత్మిక చింతనలోకి వడిపోతోన్నారు చివరికి. అంటే సంఘ సంస్కరణకీ, అధ్యాత్మిక చింతనకీ ముడివేస్తోన్నానని మీరనుకోకండి. ఏది ఏమైనా 'ఇది ఇలాగ' అని తేల్చి చెప్పడానికి మా అనుభవమూ, వయసూ చాలవు అర్ధాంతరంగా ఈ ప్రసక్తిని ఇలా నిలుపులోన్నందుకు దయచేసి మమ్మల్ని మన్నించండి."

అభ్యర్ధనగా శర్మగారివేపు చాచిన నా చేతిని పట్టుకుని లాలనగా ఆయన అన్నారు: "లేదు బాబూ! నీకు తగినంతలో చెప్పిన నాలుగు మాటయూ మంచిమాటలే చెప్పావు. ఈ తరం కుర్రకారులో ఇలాంటి ఆలోచనే లేకపోలేంది. ఇంతకూ నా బాధేమిటంటే బాబూ! కాలం చాలా మారిపోయింది. అసలు నాకు తెలిసే ఈ తిరుపతిలో వింత మార్పు! నాకు వుపనయనం అయిన దగ్గర్నుంచీ నేనీ వూళ్లోనే వుంటోన్నాను. మా తండ్రిగారీ వూళ్లోనే పూజారిగా వుండేవారప్పుడు. నేను ప్రతిదినమూ ఆయనలోటే పెందరాళే లేచి, చన్నీళ్ల స్నానంచేసి, మడిబట్టలతోనే గుడికెళ్లి దేవుని అర్చన చేసేవాణ్ని. అప్పుడీ ప్రాంతమంతా ఎంత భయంకరంగా వుండేదని! ఇదంతా ముళ్ల కంపలు. బ్రహ్మజెముళ్ళు. సాయంతం ఆరయ్యేసరికల్లా గింయ్‌మని పురుగుల రొద. మరీ అమావాస్య రోజులయితే ఇహ చెప్పక్కర్లేదు. అలాంటి సమయాల్లో నూ నేనూ, మా తండ్రిగారూ కలిసి ఏ రోజూ వేళమించకుండా రెండు సంధ్యల్లోనూ పూజలు చేసేవాళ్లం. విశేషించి శనివారాలొస్తే కాలినడకనే కొండకెళ్లి వెంకటేశ్వరుని దర్శనం చేసుకుని వొచ్చేవాళ్లం. కాళ్లకు చెప్పులుండేవికావు. ఆయన చెప్పేవారు 'శ్రీకృష్ణదేవరాయల్లాంటి మహాపురుషుడే పాదరక్షలు లేకుండా సంచరించిన పుణ్యప్రదేశం నాయనా ఇది!' అని. అంతటి నిష్ఠ, శ్రద్ధా ఇప్పుడెవరిలో వున్నాయి బాబూ! ఇప్పుడు, ఈ తిరుమలకి విహార స్థలానికొచ్చి వెళ్లొచ్చేవాళ్లు తప్పితే పుణ్యస్థలానికొచ్చి వెళ్ళొచ్చే వాళ్లెవరున్నారు? ఈ యాంత్రికమైన జీవనంలో అసలు విశ్వాసానికి తావెక్కడిది బాబూ!"

శర్మగారు నన్నూ, రాంబాబునూ పరకాయించి చూశారు.

రాంబాబు గొంతు సవరించుకున్నాడు. ఆయన చెప్పిన విషయాన్ని తనూ శ్రద్ధగా విన్నాడనేందుకు ఋజువుగా వుండాలని కాబోలు ఇలా అన్నాడు: "కనిపించే మనిషినే విశ్వసించని రోజుల్లో కనిపించని దానిమీద విశ్వాసం ఎవరికుంటుందండీ?"

శర్మగారి బోసినవ్వు మాత్రం మా మాటలమీద విశ్వాసాన్ని ప్రకటించింది. ఈ మాటల్లోపడి మేమెంతదూరం నడిచొచ్చామో మా కప్పటికే తెలిసింది.

తిరుపతినుంచి కపిలతీర్థం రోడ్డువెంబడి వెలిగే ట్యూబ్ లైట్లు పున్నమి వెన్నెలలో వెలవెలపోతోన్నాయి. ఆ రోడ్డుకు రెండు వేపులా కొత్తగా వెలసిన ఆనంద నిలయాలు మంచుమారుతానికి విడిదియిళ్లలా తలలూపుతోన్న పూలమొక్కలతో కళకళలాడుతోన్నాయి.

వాటినే చూస్తూ, నడుస్తోన్న నేను రాంబాబూ, శర్మా నా వెనకే నిలిచినట్టు గుర్తించి వెంటనే ఆగాను. రోడ్డుకు ఎడమ వేపునున్న భవంతికేసి చూపుతూ అన్నారు శర్మగారు: "ఇదే మా యిల్లు రండి...కాసేపు కూచుని వెళ్దురుగాని."

రాంబాబు నా చేతిని అందుకుని శర్మగారి వెనకే నన్ను నడిపించాడు. నేనా భవంతికేసే [illegible] చూస్తోన్నాను.

చాలా పెద్ద మేడ. దానిముందు ముచ్చటైన పూలతోట. పక్కనే పోర్టికోలో తళతళలాడుతూ హుందాగా నిలిచిన ఆకుపచ్చని కారు. అన్నివిధాలా 'ఖరీదు' కనిపిస్తోన్న బంగళా. అధునాతన పద్ధతుల్లో పొందికైన గృహాలంకరణ!

దూరంగా చూస్తోండగానే మేడమీది అంతస్తులో లైటు వెలిగింది. దానితోటే ముందున్న గ్లాస్‌డోర్‌మీద అందమైన అమ్మాయి నీడ పడింది. తెల్లని పాలరాతి మందిరంలో తనకు తానై వెలిసిన సౌందర్య దేవత నల్లని కంచువిగ్రహంలా ఆ అద్దాల మేడలో ఆమె నీడ !

ఎత్తిన తలని వంచి రాంబాబువైపు చూశాను. నా మనసుని చదివినట్టు శర్మగారు నవ్వుతూ అన్నారు. "ఆమె నా కూతురు. ఏడాది కిందటే పెళ్లయింది. అల్లుడు అమెరికా వెళ్లొచ్చాడు. మెడిసన్‌లో కార్డియాలజీ స్పెషలైజ్ చేశాడు. నాకున్నది ఆమె వొక్కతే గనక అల్లుణ్నిక్కడికే రప్పించుకున్నాను. రండి పరిచయం చేస్తాను."

ముందు నడుస్తోన్నారు శర్మగారు.

రాంబాబుతో కలిసి నడుస్తూ, స్టేట్స్‌కి వెళ్ళొచ్చిన ఆ అల్లుణ్నీ తల్చుకుంటూ, ఆ అద్దాల మేడనీ ఆ శర్మగారినీ మార్చి మార్చి చూసుకుంటూ అప్రయత్నంగా నాలో నేనే అనుకున్నాను.

"అవును. కాలం మారిపోయింది"...

# ఉదయించిన ఖడ్గం

శ్రీ మిరియాల రామకృష్ణ

ఏదేశం ముళ్ల డొంకల పుంతల్లో పగబట్టి దాక్కున్న
భుజంగాల్ని చావబాదిందో, ఏదేశం రాతిగుండెల
కొండల్లో రాజుకున్న రక్కసి కుటర్ని ఆర్పివేసిందో,
ఏ దేశం రోదనాశ్రువులు కురుస్తున్న మబ్బుల్లోకి
ఆనంద విద్యుల్లతా లతాంతాల్ని విరజిమ్మిందో, ఏ దేశం
కువ్యాపార కుంభాల్లోపలి కుతంత్రాల స్తంభాల్లోపలి కుంభ
కోణాల్ని రచ్చబండ కెక్కించిందో, ఏ దేశం కుళ్లు
గోతుల కల్లునాతుల పరిసరాల ఇరుపోని మశక ప్రగల్భ
గ నాలకు ఫిటు కొట్టించిందో, ఏ దేశం మూలగదుల
భీకర నిశ్శబ్ద కాంతంలో నక్కిన కాలవృశ్చికాలకు
కరాళగర్భ చ్ఛేదాలు చేయించిందో—

ఆ దేశం ఆదేశించింది నన్ను ఏదయినా ఒక్కపదం
రసాస్పదంగా పలకమనీ, గతనిరాశాగీతాలకు
భరతవాక్యం పలకమనీ పీడకలల చేదుగెలల విక
గిరాచేయమనీ —

కనిపించిన దృశ్యాన్ని కళ్లలో అమర్చి కలంలోంచి
కాగితానికి చేస్తాను సరఫరా చరచరా
కవిత్వం వాస్తవానికి రంగురంగులకల కాబట్టి
కవిత్వం రంగురంగుల కలలకు రమణీయాక్షర కలాపం
కాబట్టి నేను విప్పదలచిందొక ఆశ్చర్యకరమైన
తలంపుల తళత్తళల తుప్రల పెట్టి !

ఖడ్గం తూర్పున ఉదయిస్తున్నది తన ధగద్ధగంతో
దగాల మొగాలు తరగబోతున్నది.
ఖజానా పడమట అస్తమిస్తున్నది రాశీభవించిన
డబ్బుమబ్బు అబ్బురంగా కురిపిస్తున్నది దిక్కుల
దీపమరీకుల తేనెవానలు !

కేదారం ముస్తాబవుతున్నది. గాలి వాలుజడలో
ఘర్మప్రసవస్మిత రేఖలు గడిస్తున్నవి కమ్మగుబా
ళింపుల తలంపులు !

శిశిరం శిరం నరుకున్నది. తద్రక్తం రంగుగ
పూసుకున్న యువతరం తరంగీభవిస్తున్నది
భవిష్యద్వేలాంచలంలోకి.

మంచులు నల్లని సంచులు గుమ్మరిస్తున్నవి సంచిత
గుప్తరత్నజాలాలు జాతిపందిరికి మేలుకట్లుగా
ప్రపంచీకృతమవుతున్నవి.

స్తంభం పుష్పిస్తున్నది. స్తంభమే సుమిస్తున్నదని
సాగరం స్వాదువుగా మారింది. బడబానలాన్ని
బాల్పిలుగా మార్చేస్తున్నది ఉదయం.

నిశాభేదన విశారద మీ ఉదయం నిరాశాహిమనిషూదన
చణ మీ ఉదయం అహో ఉదయం ఇది మహోదయం
మానవతా నవతా నవనీతోదయ వేళా ప్రసాదిత మీ ఉదయం
అహో ఉదయం ఇది మహోదయం !

# కాకతి వీరరుద్రుని ఉత్తరేశ్వర తామ్రశాసనము (శక సం॥ 1211)

శ్రీ సి. సోమసుందరరావు
&
శ్రీమతి ప్రతిభ చిన్నప్ప[1]

పదిహేను సంవత్సరములకు పూర్వము పశ్చిమ గోదావరి జిల్లాలోని ఖండవల్లి గ్రామంలో శ్రీ కె. సాంబశివరావుగారు తమ గృహమునకు పునాదులు త్రవ్వించుచుండగా యీ శాసనము మరిరెండు శాసనములతోబాటు బయల్పడినది.[2] శ్రీ సాంబశివరావుగారి సోదరులు శ్రీ సత్యనారాయణగారు 1959 లో సర్టిఫికెట్ కోర్సుకై యూనివర్సిటీకి వచ్చిన సందర్భములో వీటిగురించి డా॥ ఓరుగంటి రామచంద్రయ్యగారికి, కీర్తిశేషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి తెలియచేశారు. ఇరువురు సోదరులు దయతో శాసనములను ఆంధ్ర విశ్వవిద్యాలయమునందలి చరిత్ర, పురావస్తుశాఖకు యిచ్చారు. ప్రస్తుత శాసనమును ప్రభుత్వశాసనశాఖవారు 1961–62వ సంవత్సర నివేదికలో తామ్రశాసనము నెం. 19గా గుర్తించారు. తరువాత ఎపి గ్రాఫియా ఇండికా, 38 వ సంపుటము, 76 93 పుటలలో ప్రచురించారు. శాసన ప్రతిబింబములే ఆధారమగుటవలన వారి పాఠములో కొన్ని తప్పులు పడినవి.

ఈ శాసనము 7 రేకులమీద వ్రాయబడినది. మొదటి రేకు పై భాగం తప్ప మిగిలిన రేకులు అన్నిటిమీద యిరువైపుల వ్రాయబడి ఉన్నది. ఉన్న యేడు రేకులలో మొదటి ఐదురేకులు ఎక్కువ మందముగ ఉన్నవి. ఈ రేకుల పొడవు దగ్గరగా 28 సెం॥మీ, వెడల్పు 15 సెం॥మీ. వీటి మొత్తం బరువు సుమారు 7 కిలోగ్రాములు. ప్రతి రేకునకు రెండవ పెడ ఎడమ వైపుగ వాటి క్రమసంఖ్య వేయబడి ఉన్నది. ఈ శాసనమునకు రాజ ముద్రికగాని, కడియముగాని లేవు. అయినా, యిది ప్రామాణిక శాసనముగ తీసుకొనుటకు సందేహము లేదు. వినాయకపుర శాసనములోని యీ శాసన ప్రస్తావనే యిందుకు తార్కాణము.[3]

ఈ శాసనలిపి గణపతిదేవుని గరవపాడు,[4] ప్రతాపరుద్రుని కాలమునాటి రాజరుద్రుని గొరవంకపల్లి[5] శాసనములోని లిపిని పోలి యున్నది. 13వ శతాబ్దపు తెలుగు లిపిలో యీ శాసనము వ్రాయబడి యున్నది. శాసనములోని పంక్తులు 148 నుండి 177 లో నున్న లిపి మాత్రము భిన్నముగ ఉండుటచే, లవి వేరొకనిచే తదుపరి కాలములో వ్రాయబడి యుండవచ్చును.[6] అచ్చు 'ఋ', హల్లులు 'గ, జ, ర' యిప్పటి వాటివలె ఉన్నవి. 'క' రెండు రకములుగ వ్రాయబడినది. ఉదా: 'కుప్యన్తి' 'చంద్రికోన్నిద్రాః' (14 వ పంక్తి) ఫకారములోని వత్తు రెండు విధములుగ సూచింపబడినది. ఉదా: 'స్ఫురన్తి' (11 వ పంక్తి), 'మహాస్ఫూరతి' (64 వ పంక్తి). 'ర', 'ఢ' లకు భేదా తక్కువ. గుణింతములో ఏకారము కొన్నిచోట్ల 14వ శతాబ్ది శాసనములలోవలె ఉన్నది. [ఓఫ్ఘేరారబ్దే (46 వ పంక్తి), వేదే నైపుణం (96 వ పంక్తి)]. వలపలగిలక వచ్చినపుడు సాధారణముగ హల్లు ద్విరుక్తమయినది. వర్గలోని అనునాసికమునకు బదులు చాలచోట్ల అనుస్వారము వ్రాయబడినది.

ఈ శాసనమునందు 68 సంస్కృతశ్లోకములు కలవు. శ్లోకములలో ఉత్ప్రేక్ష, మాలోపమ, శ్లేష, అనుప్రాస మొదలైన అలంకారములు వాడబడినవి. గద్యలో కొంత సంస్కృత వచనము, గ్రామ సరిహద్దులు చెప్పేటప్పుడు తెలుగు వినియోగింపబడినవి.

కాకతి వీరరుద్రుని బంటైన ఇందుశేఖరుడు రుద్రదేవుడను పండితునకు ఉత్తరేశ్వరం అనే గ్రామం దానంగా యిచ్చినట్లు, అతడు తిరిగి దానిని తన గురువైన విద్యా దీక్షితునకు యిచ్చినట్లు తెలియజేయడమే యీ శాసనం ముఖ్యోద్దేశం. విద్యన కొంతమంది వైదిక బ్రాహ్మణులకు ఆగ్రామంలో వృత్తులు యిచ్చాడు. శకసంవత్సరము 1211. విరోధి, భాద్రపదమాసమందలి చంద్రగ్రహణ కాలమున రుద్రదేవుడు యీ దానాన్ని చేసినట్లుగా చెప్పబడినది. (శ్లో 16–

21) ఆరోజు క్రీ. శ. 1290, ఫిబ్రవరి, 25 వ తేదీకి సరిపోతుంది. ఆరోజు శనివారము. విద్దన ఓనపల్లి గ్రామము, పులుపర్తిలో 30 ఖారీల భూమిని గ్రహించి, మరల బ్రాహ్మణులకు దానము చేసెను.

విఘ్నేశ్వరుడు, పోరేశ్వరుడు, విష్ణువుయొక్క వరాహావతారము. శివుని తలపై గల చంద్రవంక, నారాయణుడు, బ్రహ్మశాసనం మొదట స్తుతింపబడినారు. (శ్లో. 1–5). రాజ్యములన్నిటిలోను మిక్కిలి యింపగు ఆంధ్రమండలము తర్వాత వర్ణింపబడినది. (శ్లో 6) ఓరుగల్లుయొక్క గొప్పదనము శ్లో. 7-9 వర్ణించును. ఆ నగరమునకు దేవతలగు స్వయంభువు, వింధ్యవాసినులు అధిదేవతలు. ఆ నగరమున క్షితీశ్వరుడు కాకతి వీరరుద్రుడు. (శ్లో. 10) శ్లోకములు 11–15 లలో శాసన దాతయగు ఇందుశేఖరుని వంశమును గురించి ప్రస్తావనకలదు. ఇతని తండ్రి శత్రువులకు మృత్యువంటి యైన మహాదేవుడు; తాత ఇందు శేఖరుడు; ముత్తాత విష్ణువర్ధనుడు.

శ్లో. 22–29లు ఇందుశేఖరునివద్దనుండి ప్రథమముగ ఉత్తరేశ్వరము బడసిన రుద్రదేవుని గురించి, అతని తండ్రి గురించి చెప్పను. రుద్రదేవుని తండ్రి పిన్నయాచార్యుడు. అతడు సోమయాజులలో ప్రథముడు. కలియుగము నుద్ధరింపుటకై అవతరించినవాడు, పవిత్రతచే వసిష్ఠుడు. లక్ష్మీసరస్వతులు అతనిలో మూర్తీభవించినవి. అతని కుటుంబీకులందరు రాజాదరణ పొందియుండిరి. రుద్రదేవుడు పితృభక్తిగలవాడు. అతడు పండితులను, కవులను పోషించుచు వారికి అనేక దానముల నిచ్చెను. అతడు మీమాంస, తర్కము, తంత్రము మున్నగు శాస్త్రములలోను, కవిత్వములోనుదిట్ట.

శ్లో. 30-61లు రుద్రదేవుని గురువగు విద్దన దీక్షితుని ప్రశంసించును. ఇతడు ఉత్తరేశ్వర గ్రామము గురుదక్షిణగా పొందెను. ఇతడు కపిగోత్రుడు. తండ్రి శ్రీరంగాచార్యులు. పద్యరచనలోను, శాస్త్రములలోను కోవిదుడు. పండిత సభలలో నైపుణ్యమునకు, గౌరవమునకు వాసిగాంచిన దేవనాచార్యుడు విద్దన తాతగారు. పండితులలో వజ్రము వంటివాడనియు, సరస్వతీ ప్రసన్నుడనియు ప్రసిద్ధి గాంచిన రుద్రాచార్యుడు విద్దన ముత్తాత.

విద్దన వేద, వేదాంతములలోను, పూర్వోత్తర మీమాంసలలోను, శైవాగములలోను, యోగములోను, తంత్ర, మంత్ర, ధర్మ శాస్త్రములలోను ప్రవీణుడు. అతడు న్యాయ, తత్త్వములపై వ్రాసిన 'ప్రమేయ చర్చామృతము' పండితులచే కొనియాడబడినది. వేదాంత చర్చలలో మూర్ఖులు సహితము యీ పుస్తక ప్రభావముచే విజయమునొందిరి. శాస్త్ర గ్రంథములలోని అనేక అభిప్రాయములను మథించగా ఉద్భవించిన అమృతమే 'ప్రమేయ చర్చామృతము.'

విద్దనాచార్యుడు వాగేశరత్నాకరమను నగరములోని పండిత గోష్ఠులలో పాల్గొని ప్రసిద్ధికెక్కెను. భీమవల్లభ పురమువద్ద అతడు ఒక సరస్సును త్రవ్వించెను. అది కాలక్రమమున శివతీర్థమని ప్రసిద్ధికెక్కినది. అక్కడ అతడు శివజ్ఞానేశ్వర ప్రతిష్ఠచేసి, యితర సోమయాజు లందరును ఆశ్చర్యచకితులగునట్లు అగ్నిష్టోమమును వైభవోపేతముగ చేసెను. అయాచితముగ రాజమర్యాద నందెను. కుమారరుద్రుడు ఒక ఛత్రమును పల్యంకికను, 100 నిష్కములను విద్దనకు దానమొసర్చెను.

విద్దన స్వయముగ శివుని అవతారమని (శ్లో. 33), రాజు అతనిని స్వయంభూదేవునిగనె భావించెడివాడని (శ్లో. 52) వర్ణింపబడినాడు

విద్దన రుద్రదేవునినుండి గ్రామమును గ్రహించి, వేద, శాస్త్ర, ఆగమాదులలో కోవిదులగు పండితులకు దానమిచ్చివేసెను. గ్రామములో ప్రతియొకనికి 3 ఖారీల భూమి నిచ్చెను. ఆ బ్రాహ్మణుల పేర్లు యీ క్రింద యీయబడినవి:

| వరుససంఖ్య | ప్రతి గృహీతల పేర్లు | గోత్రము |
|---|---|---|
| 1. | కుమారస్వామి (సర్వక్రతుయాజి) | హారిత |
| 2. | మంచెన సోమయాజి | ,, |
| 3. | తోంట ఘటశాసి[7] | ,, |
| 4. | కేసన ఘటశాసి | ,, |
| 5. | యజ్ఞనారాయణ ఘటశాసి | ,, |
| 6. | అప్పన ఘటశాసి | ,, |
| 7. | విశ్వనాథ ఘటశాసి | ,, |
| 8. | కంచి ఘటశాసి | ,, |
| 9. | వామదేవ ,, | ,, |
| 10. | శ్రీరంగ ,, | ,, |
| 11. | కంచి ,, | ,, |
| 12. | రేమణ ,, | భారద్వాజ |
| 13. | విశ్వేశ్వర ,, | ,, |
| 14. | మారె భట్టోపాధ్యాయ[8] | ,, |
| 15. | కామదేవ ఘటశాసి | ,, |
| 16. | వల్లభ ,, | ,, |
| 17. | తల్యె ,, | ,, |
| 18. | పోతి ,, | ,, |
| 19. | పంపయ సోమయాజి | ,, |

| | | |
|---|---|---|
| 20. | పురాయి ఘటశాసి | ,, |
| 21. | అన్నక ,, | ,, |
| 22. | సూరె భట్నోపాధ్యాయ | ఆత్రేయ |
| 23. | శరభ ,, | ,, |
| 24. | రాలిపెద్ది భట్టోపాధ్యాయ | గౌతమ |
| 25. | వెలుపులపోతి ఘటశాసి | ,, |
| 26. | అనంత భట్నోపాధ్యాయ | కౌండిన్య |
| 27. | నూకన ఘటశాసి | ,, |
| 28. | అప్పన భట్నోపాధ్యాయ | ,, |
| 29. | కేశవ భట్నోపాధ్యాయ | ,, |
| 30. | సూర ఘటశాసి | ,, |
| 31. | కామదేవ ఘటశాసి | ,, |
| 32. | నారసింహ ,, | ,, |
| 33. | దామోదర ,, | ,, |
| 34. | దేవన ,, | ,, |
| 35. | కందర్ప ఘటశాసి | వాఘూల |
| 36. | సూరె ఘటశాసి | ,, |
| 37. | పురుషోత్తమ ఘటశాసి | ,, |
| 38. | మంచెన ఘటశాసి | కాశ్యప |
| 39. | అనంత ఘటశాసి | ,, |
| 40. | దేవన ఘటశాసి | శఠ |
| 41. | సర్వదేవ భట్నోపాధ్యాయ | శాండిల్య |

ఓరపల్లి గ్రామము, పులుపత్తులో 30 ఖారీల భూమిని పొందిన పిమ్మట విద్దన దానిని ఉత్కగేశ్వర పురపు పొలమునకు కలిపి వేసెను. ఈ క్షేత్రమును యీ క్రింది బ్రాహ్మణులకు యిచ్చెను.

| వరుససంఖ్య | ప్రతి గృహీతల పేర్లు | గోత్రములు | వృత్తులు |
|---|---|---|---|
| 1 | విద్దన భట్నోపాధ్యాయ | హారిత | 2½ |
| 2 | రుద్రదె సోమయాజి | ,, | 2 |
| 3 | ప్రోలె ఘటశాసి | ,, | 2 |
| 4 | అన్నె ఘటశాసి | ,, | 2 |
| 5 | పురుషోత్తమ భట్టోపాధ్యాయ సోమయాజి | ,, | 2 |
| 6 | ప్రోలె భట్నోపాధ్యాయ | ,, | 2 |
| 7 | కేశవ ,, | ,, | 2 |
| 8 | ఎన్నెహి తాత | ,, | ... |
| 9 | వల్లభ సోమయాజి | ,, | 1/2 |
| 10 | కంచి ఘటశాసి | ,, | ... |
| 11 | నరసింహ ,, | ,, | ... |
| 12 | శ్రీరామ ,, | ,, | 1/2 |
| 13 | తొట్టెపె యజ్ఞేశ్వర ఘటశాసి[9] | ,, | 1/2 |
| 14 | యజ్ఞేశ్వర ఘటశాసి | ,, | 1/2 |
| 15 | సూరె ఘటశాసి | ,, | 1/2 |
| 16 | జన్నె ఘటశాసి | ,, | 3/4 |
| 17 | దేవరె భట్టోపాధ్యాయ | భారద్వాజ | ... |
| 18 | రేమన ,, | ,, | ... |
| 19 | కూచన ,, | ,, | ... |
| 20 | మంచి ,, | ,, | ... |
| 21 | నరసింహ ఘటశాసి | ,, | ... |
| 22 | పురాయి ,, | ,, | 1/2 |
| 23 | సోమేశ్వర ,, | ,, | 1/2 |
| 24 | కామదేవ భట్టోపాధ్యాయ | ,, | ... |
| 25 | ఎఱపోత ఘటశాసి | ,, | 1/2 |
| 26 | నరసింహ ,, | ,, | 1/4 |
| 27 | విశ్వేశ్వర ,, | ,, | ... |
| 28 | జన్నె ,, | ,, | 1/2 |
| 29 | నూంకన ,, | కౌండిన్య | ... |
| 30 | సోమిది భట్నోపాధ్యాయ | ,, | ... |
| 31 | విశ్వేశ్వర ,, | ,, | ... |
| 32 | గుండిమంచి ఘటశాసి | ,, | ... |
| 33 | దొడ్డ ,, | ,, | ... |
| 34 | భీమేశ్వర ,, | ,, | ... |
| 35 | విశ్వనాథ ,, | ,, | ... |
| 36 | రొంట సోమయాజి | ,, | ... |
| 37 | వెన్నె ఘటశాసి | ,, | ... |
| 38 | యజ్ఞేశ్వర భట్నోపాధ్యాయ | ,, | ... |
| 39 | నాగదేవ ఘటశాసి | ,, | ... |
| 40 | కనకవెల్లి నరసింహ ఘటశాసి | ,, | ... |
| 41 | నరసింహ ఘటశాసి | ,, | ... |
| 42 | పిచన | ,, | 1/2 |
| 43 | కందర్ప ఘటశాసి | ,, | 1/2 |
| 44 | ప్రోలె భట్నోపాధ్యాయ | ,, | 1/2 |
| 45 | జన్నె భట్నోపాధ్యాయ | ,, | 1/2 |
| 46 | కోరెన ఘటశాసి | ,, | 1/2 |
| 47 | గొంకయ భట్నోపాధ్యాయ | గౌతమ | ... |

| | | | |
|---|---|---|---|
| 48 | విజపోత ఘటశాసి | గార్గ | ... |
| 49 | దేవ భట్టోపాధ్యాయ | ఆత్రేయ | 3/4 |
| 50 | సోమనాథ ఘటశాసి | ” | 1/2 |
| 51 | జన్నె ” | ” | 1/2 |
| 52 | అన్నె ” | లోహిత | ... |
| 53 | కామన ” | ” | 1/4 |
| 54 | కామన ” | కౌశిక | ... |
| 55 | మారె ” | ” | ... |
| 56 | ప్రోలె ” | కాశ్యప | ... |
| 57 | దేవ యాజ్య | ” | 1/2 |
| 58 | నారాయణ ఘటశాసి | ” | 1/2 |
| 59 | ఉత్తరేశ్వర ఘటశాసి | శఠ | ... |
| 60 | జన్నె సోమయాజి | వాధూల | ... |
| 61 | శ్రీరామ భట్టోపాధ్యాయ | విష్ణువృద్ధ | 1/2 |
| 62 | పురుషోత్తమ ఘటశాసి | ” | 1/2 |
| 63 | కంచర్ల ” | భారద్వాజ | 1/4 |
| 64 | పెద్ది ” | ... | 3/4 |
| 65 | గోమట భరత | ... | 1/2 |
| 66 | సర్వదేవ ఘటశాసి | కపి | 1/2 |
| 67 | ఆరాధ్యకుమారుడు వీరభద్రుడు | కపి | 1/2 |

| | | |
|---|---|---|
| విద్దన భట్టోపాధ్యాయ | కపి | 12 |
| మార్కండేశ్వర మహాదేవ | — | 5 |
| ఉత్తరేశ్వర మహాదేవ | — | 3 |
| జనార్దన వల్లభ | — | 2 |

108 నుండి 118 వరకుగల పంక్తులు ఉత్తరేశ్వరమునకు ఎల్లలు చెప్పును. వివిధ దిక్కులలో ఓనపల్లి, కడమి, పులుపర్తి, ప్రేకేరు, ముక్కోమల గలవు. ఫలశ్రుతి ప్రతిగృహీతల రెండు జాబి వెనుక గలదు (పంక్తులు 138-148, 175-76).

ఈ శాసనము కాకతీయుల బంధువులను గూర్చి తెలుపుచున్నది. కాకతి వీరరుద్రునిపేరు మొదట తెలుపబడినది. అతని బంధువు విష్ణువర్ధనుడు. ఈతని పుత్రుడు ఇందుశేఖరుడు, మనుమడు మహాదేవుడు, మునిమనుమడు ఇందుశేఖరుడు.

దాతయొక్క ప్రపితామహుడు కాకతీయుల బంధువని తప్ప స్పష్టమైన బంధుత్వము శాసనము తెల్పుటలేదు. కాని వారు కాకతీయులలో వైవాహిక సంబంధములుగల నిడుదవోలు చాళుక్యులు తప్ప వేరొకరు కానేరరు. రాజులపేర్ల పోలిక, శాసనమునందుగల ఊళ్ల పేర్లు చాళుక్య భూమియందుండుట, పై నిర్ణయమునకు ప్రమాణము. జుత్తిగ, పాలకొల్లు[10] శాసనములనుబట్టి కాకతి రుద్రమదేవి ఉదయాంబ, ఇందుశేఖరుల పుత్రుడైన చాళుక్య వీరభద్రుని పతిగా యుపాడినట్లు తెలియుచున్నది. అవి యీ క్రింది వంశక్రమమును యిచ్చుచున్నవి :

జుత్తిగ (పశ్చిమ గోదావరి జిల్లా), క్రీ శ 1259
కాకతీయ గణపతి
|
రుద్రదేవి + చాళుక్య వీరభద్రుడు.

పాలకొల్లు (పశ్చిమ గోదావరి జిల్లా), క్రీ. శ. 1264
ఇందుశేఖరుడు + ఉదయాంబ
|
అన్నమాంబ + హైహాయ భీమవల్లభ | వీరభద్రుడు

క్రీ. శ. 1266నాటి పాలకొల్లులోని మరియొక శాసనము చాళుక్యాధిపతి ఇందుశేఖరుని తండ్రియు, వీరభద్రుని తాతయునగు విష్ణువర్ధనుని గూర్చి తెలుపుచున్నది[11] ఈ మూడు శాసనములు క్రిందివిధముగ వీరభద్రుని వంశమును నిర్ణయించుటకు ఉపయోగపడుచున్నవి :

విష్ణువర్ధనుడు
|
చాళుక్యాధిపతి ఇందుశేఖరుడు + ఉదయాంబ
చాళుక్య వీరభద్రుడు + కాకతి రుద్రదేవి

కొలనుపాక శాసనాధారములో శ్రీ పి.వి.పి. వీరభద్రరావు, డా. ఎమ్. రామారావు, శ్రీ కె. లక్ష్మీరంజనం వీరభద్రుని వంశక్రమమును వేరొక విధముగ గమనించిరి.[12]

క్రీ. శ. 1279నాటి కొలనుపాక శాసనము[13] నందు వీరభద్రుడు, అతని భార్య రుద్రదేవి, మహాదేవరాజు, అతని భార్య లక్కాంబ, వారి పుత్రుడు ఇందుశేఖరుడు మొదలగువారి ప్రశంస కలదు. ఈ ముగ్గురు చరిత్రకారులు మహాదేవ, లక్కాంబల పుత్రుడగు ఇందుశేఖరుడు, ఉదయాంబ భర్తయగు ఇందుశేఖరుడు ఒకరేనని తీర్మానించిరి. దీనివలన వీరభద్రుడు మహాదేవునియొక్క మనుమడగును. అప్పుడు మహాదేవుడు, విష్ణువర్ధనుడు ఒకరేనని చెప్పవలయును. అప్పుడు వంశక్రమము :

మహాదేవరాజు (రేక) విష్ణువర్ధనుడు + లక్కాంబ
|
ఇందుశేఖరుడు + ఉదయాంబ
|
వీరభద్రుడు + రుద్రదేవి

కాని కొలనుపాక శాసనము వీరభద్రునికి, మహాదేవునకు గల సంబంధమును గూర్చి స్పష్టపరుపదు, పైన పేర్కొనిన శాసనమునందలి రెండవవైపు వీరభద్రుని గూర్చి తెలుపబడినది. కాని ఆఖరిపంక్తి (10వ శ్లోకము) అసంపూర్ణముగ ఉన్నది.

"............జ్యే
ష్ఠశ్చాళుక్య వంశార్ణ
.................."

మిగిలినదంతయు చెడిపోయినది. మూడవ పక్క వాక్యమధ్యముతో ప్రారంభింపబడినది. అది 'శత్రువులనబడు చీకటికి కాంతివంటి' ఒకరిని గూర్చి తెలుపుచున్నది. తరువాతి శ్లోకము (12) ఇందుశేఖరుడు మహాదేవ, లక్కాంబలకు పుట్టినట్లుగ చెప్పుచున్నది.

"............॥[11* ]లక్కాంబా
యాంసుతో జాత శ్రీ మహా
దేవరాజతః/నామ్నేందుశే
ఖరో రాజాకుమార శ్శివయో
రివ ॥[12*] ఇందుశేఖర నరేంద్ర
నందనే నందతి స్వయమ
శేష నందనే/జగ్మషాం విత
రణం రణం ముహు(స్స*)[s
స్తత్రైవ విదుషాం ద్విషామపి॥[13*]

"జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ" వీరభద్రునికి అన్వయించుననియు, "ఇందుశేఖర నరేంద్ర నందనే" అనునది "ఇందుశేఖర నరేంద్ర (స్య) నందనే" (ఇందుశేఖరుని కుమారుడు) అనియు డా. రామారావు, శ్రీ వీరభద్రరావు భావించుచున్నారు.

వీరభద్రునకు, మహాదేవునకు గల సంబంధము స్పష్టముగ తెలియకపోవుటచేతను, ఇందుశేఖర నరేంద్రుని పుత్రుని పేరు అందులో లిఖింపబడకపోవుటచేతను, వారు ఇందుశేఖరుని కుమారుడు వీరభద్రుడనియు భావించుచున్నారు. అప్పుడు అతడు కనీసము క్రీ. శ. 1279 వరకు బ్రతికియుండవలెను. కాని వీరభద్రుని తల్లి యైన ఉదయాంబిక పాలకొల్లులో క్రీ. శ. 1266లో తన కుమారునికి పుణ్యము కలుగుటకు దానమిచ్చినట్లు తెలియుచున్నది. పెద్దలు పిన్నల పేరిట దానమిడుట పిన్నల మృతి పిదపనే పైగా ప్రస్తుత శాసనము లేమియు రుద్రదేవి యొక్క భర్తనుగూర్చి ప్రసంగించలేదు. 13వ శ్లోకం వలన రాజకుమార ఇందుశేఖరుడు – 'ఇందుశేఖర నరేంద్ర నందన' – క్రీ. శ. 1279వరకు జీవించినట్లు స్పష్టమగుచున్నది. 16వశ్లోకం ప్రకారము అతడు వీరేందుశేఖరుడని, పోతి నాయకుని ప్రభువని, కొలనుపాక శాసనదాత అని చెప్పబడినాడు. కనుక 'ఇందుశేఖర నరేంద్ర నందన'ను 'ఇందుశేఖర నరేంద్ర (స్య) నందన' అని చదువుటకు వీలులేదు.

డా॥ పి. శ్రీనివాసాచార్[14] కొలనుపాక శాసనమును అనువదించుచు మహాదేవుడు వీరభద్రుని అన్నగారనియు, ఇందుశేఖరుడు సోదరుని కుమారుడనియు పేర్కొనిరి. మహాదేవుడు, పాలకొల్లు శాసనములోని విష్ణువర్ధనుడు, ఒక్కరేనని అనుటగాని, రాజకుమార ఇందుశేఖరుని ఇందుశేఖరుని పుత్రునిగ భావించుటగాని అవసరము లేదు. కొలనుపాక శాసనము బంధుత్వమును ఈ క్రింది విధముగ తెలుపుచున్నది :




ఉత్తరేశ్వర శాసనము ఆ బంధుత్వమునే స్థిరపరుచును.




రెండవ ఇందుశేఖరుడు, మహాదేవరాజు పుత్రుడైన ఇందుశేఖరుడు ఒక్కరే యనుటకు ఎట్టి అభ్యంతరము ఉండదు. మహాదేవుడు లక్కాంబ భర్తయగు మహాదేవరాజు అయి ఉండవచ్చును. మొదటి ఇందుశేఖరుడు ఉదయాంబ భర్తయును, విష్ణువర్ధనుడని పేర్కొనబడిన వ్యక్తి అతని తండ్రియును కావచ్చును.

ఉత్తరేశ్వర శాసనము వీరభద్రునిగూర్చి ఏమియు తెలుపదు.

కొలనుపాక శాసనము అతనిని పొగడిన పిదప, "జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ ..." అనుదానితో ప్రారంభమగుచున్నది. అది ఎవరికి వర్తించునో స్పష్టముగ తెలియదు. ఆ మాటలకు అనువాదములో "చాళుక్యవంశాంబుధిలో పెద్దవాడు (జ్యేష్ఠుడు) అని కలదు. అతడు కుటుంబమునకు పెద్దగాని, అన్నగారు కాని అయియుండవచ్చును. తదుపరి శ్లోకములో వచ్చునటువంటి 'శత్రుపేకటి మాటమికి వెయ్యుడురు' వంటివాడుకూడ ఎవరికి చెందునో తెలియదు. ఇందులో పేర్కొనబడిన వాడు వీరభద్రుని అన్న అయియుండవచ్చును. తరువాతి శ్లోకములోనే 'మహాదేవ, అక్కాంబలకు ఇందుశేఖరుడు ఉదయించి'నట్లు పేర్కొనబడినది. "జ్యేష్ఠశ్చాళుక్య వంశార్ణ." వీరభద్రునికి వర్తించినట్లైనచో, మహాదేవుడు అతని తమ్ముడై ఉండవలెను; అది మహాదేవునకు వర్తించిన, వీరభద్రుడు అతనికి తమ్ముడై ఉండవలెను. వీరభద్రుడు భార్యతో వెళ్ళినట్లును, మహాదేవుడు చాళుక్య సీమలను పాలించినట్లు తెలియుటచే[15] మహాదేవుడే పెద్దవాడనుట స్పష్టము. చాళుక్యవంశ క్రమము యీ విధముగ ఉండవలెను :




కొలనుపాక, ఉత్తరేశ్వర శాసనములు రెంటిలోను ఇందుశేఖరుడు కాకతీయ సార్వభౌముని ఆధిపత్యమును అంగీకరించుచున్నాడు. చాళుక్యులు కాకతీయుల పాలనకు లోబడినవారని యిందుమూలముగ స్పష్టమగుచున్నది.

క్రీ. శ. 1262 నుండి 1278 వరకు గోదావరి ప్రాంతమందు కాకతీయ శాసనములు లభించకపోవుట చేతను,[16] ప్రాయికం రాజులగు చాళుక్యులు, హైహయులు వారి పేరను స్వతంత్రముగా శాసనములు వ్రాయించుటచేతను, డా॥ ఎన్. వెంకటరమణయ్య, శ్రీ సోమశేఖర శర్మ ఆ సమయములో ఆ ప్రాంతమందు కాకతీయ పాలన క్షీణదశలో నున్నట్లు తలచిరి.[17] కాని యీ స్వతంత్రపాలన క్రీ. శ. 1278తో అంతమయినదనుటకు ఆధారములేదు. ఆ రెండు రాజ్యములు క్రీ. శ. 1300 వరకు కాకతీయుల ఆధిపత్యమును గుర్తించక వారి పాలనను సాగించినవి.[18]

ఈ శాసనము వీరరుద్రుడు రాజ్యముచేయుచున్నపుడు యివ్వబడినది. శాసనతేదీ 1290 నాటికి యితడు రాజయ్యెనా అన్నది సమస్య. ఇదివరలో రుద్రమదేవి క్రీ. శ. 1295 వరకు రాజ్యముచేసెనని తలంపు ఉండెడిది. ఇప్పుడు చందుపట్ల శాసనమువలన 1289లో ఆమె మరణించెనని తెలియుచున్నది.[19] అందువలన శాసనము ఆఖరి కాకతీయరాజగు ప్రతాపరుద్రుని కాలమునాటిది.

శాసన ప్రతిగ్రహీతయైన విద్యానాచార్యుడు గొప్ప పండితుడు. అతని పాండిత్యము యీ శాసనము, వినాయకపుర శాసనములోను కొనియాడబడినది. అతనికి యీ శాసనము ప్రకారము ఉత్తరేశ్వరము, మిగత శాసనముల ద్వారా ఓనపల్లి గ్రామము, వినాయకపురము, పులుపర్తులలో కొంతభూమి లభించినట్లు తెలియుచున్నది.

శాసనమునందు చెప్పబడిన కొన్ని స్థలములను మనము గుర్తించవచ్చును— పేకేరు (పేకేరు), ముక్కోమల (ముక్కామల). పులుపర్తి (రెడ్డి రాజుల కాలమునందు అన్నమావరముగ మార్చబడినది; యిప్పటి అన్నవరప్పాడు)[20] ఈ గ్రామము అన్నియు పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకు సమీపమున గలవు. ఉత్తరేశ్వరమును గుర్తించుట కష్టము; కాని మిగిలిన గ్రామములతోపాటు యిదికూడ తణుకు తాలూకాలోనే ఉండవలెను. భీమవల్లభపురము పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరము కావచ్చును.

## శాసన మూలము(1)

### మొదటి రేకు- రెండవ పెడ(2)

1 ఓం[3] స్వస్తి ॥ ప్రత్యూహ వ్యూహరాజస్సు భవతు భవతాం శ్రేయసే భూయసే బృస్పీ (భూయసే : పే ?)

2 వ్యా ధ్వాన్తాకరం చోపరి విస్ఫురతి లాన్ వ్యోప్పు యస్మిన్ పురస్మిన్ (1) మందం మందం వహన్తః

3 పరిసర శిశిరం ప్రేమరంగైస్తరంగై రాఠంగ్యా రింఖ్యత్పుత్రం

75 దిన షణ్ముఖః ।భాస్వానివో ‘యా గీ శాదమృతాం శురివో
ఏదే

76 ః ॥ [43*] వాగీశరత్నాకరనాప్పియః పురే వ్యధత్త సమ్య
గ్యథి నవ్యగ్ లోముఖం (మ్) ॥ (।)

77 షఘ్నే నఖం యస్య వవో విజృంభితం ముహుర్ముహ్ హునూవ్
(స్వ ఘా)జ్జగతి నవ్యాత్ తో

78 మఖం (మ్) ॥ [44*] యదుపవన శుకానాం క్వాపి లీలా
రలానాం పరిసరముపయా

79 లాఃపండిరాస్త్వదోధిః ॥ (।) విదధతి నిజశాస్త్రే సంశ
యాచ్ఛేద పేథ్యో మధు

80 ఏల విశేష వదరా దప్పర్యన్తః ॥ [45*] భీమవల్లభపు
య్యాగ యః క

81 రేన్మ సరోవరం (మ్) । శివతీర్థ్ మితి ఖ్యాతం
యదంబు వసుధాసుధా ॥ [46*] ధీ

## నాలుగవరేకు - రెండవపెడ

82 మవల్లభపురీ విభూషణం యస్తడాగముదపాదయత్ క్షణాత్
॥( । )

83 వి) (శు) తం హి శివతీర్థ్ సంజ్ఞయా విస్ఫురన్తమివ
పుణ్య [24] సంచయం (మ్) ॥[47*]

84 శివజా స్వేరన్యత్ర (బ్రహ్మేశ్వరం తత్ర) ప్రతిష్ఠాపయతిస్మ
యః।వస్తుధ్యేయమి

85 వాస్మియం కర్తుం లోచనగోచరం (మ్) ॥[48*] అగ్ని
ష్టోమం కరోతిస్మయః పురే భీ

86 మన్నాథే। తథా విస్మయమాయాన్తి పశ్యన్తః సోమయాజినః
। [।49*] ప్రా

87 [25] స్వర్గలో యమువనీశకుల ప్రవేశో యస్యాఖిలామల మతిశ్వ
రభా

88 గపూర్తైః । యస్మై కృతం ప్రథమ దర్శన ఏవ రాజ్ఞా [26]
కప్పూర

89 పూగఫల భోగ సమర్పణం చ ॥[50*] అదత్తయస్మై
స్వయ మాత పత్రం [27]

90 ఛాందోగానాం రుద్రకుమారవీరః । పర్యాయ వృతిం పరి
హాయ యస్మై



నాలుగవరేకు — మొదటి పెడ

91 తేనోచితం నిష్కం చ దత్తం (మ్) ।[51*] దేవః
స్వయంభూరితి యద్భక్తిం కరోత్యసౌ

92 రుద్రనృపోమౌళిః । బ్రాహ్మేముహూర్తే పురుషం పురాణం
ధత్తేన్వహం యో

93 హృదయాంబిందే ॥ [52*] అగ్నిహోత్రాద్యనుష్ఠానం నర
కుంజర పూజనం (మ్) । స్వయంభు

94 వే నమస్కుర్మ్ష ప్రనామావలోకనం (మ్) ॥ [53*]
పరస్యమహసా ధ్యానస్త్వన్మ (ధ్యానం ధర్మ్) ని

113 పశ్చిమతః ॥ (।) ఉత్తరేశ్వరపురము ప్రేకేటి పొలమేర పుట్టకోడు ।(।*) అనన్త
114 రతః । ఉత్తరేశ్వరపురము ప్రేకేటి మ్రోమం ముయ్యు కుట్టుల జమ్మి (।*)
115 [32] వాయవ్యతః । పెద్దమడ్గు నడుము । (।*) ఉత్తరతః । మోటచిన్నకో
116 డు । (।*) ఈశాన్యతః । గంగాదేవి నడుము । సంగాము పూర్వోన
117 గంగాదేవి నడుము । సంగాము దక్షిణానను మేడిపుంత । సంగాము మను
118 డ నుండి దక్షిణమించి రాగాను మూగూడి కోడు ॥ త ఏతే । కుమారస్వామి
119 ప్వా క్రతుయాజినః । మంచెన సోమయాజినః । తొంట ఘట
120 శాసినః । కేశవ ఘటశాసినః । యజ్ఞనారాయణ ఘట శాసినః (।*)
121 అప్పన ఘటశాసినః ॥ ఏతే హారీతాః ॥ విశ్వనాథ ఘట శాసినః ।

## ఆరవరేకు - మొదటిపెడ

122 కంచి ఘటశాసినః । వామదేవ ఘటశాసినః । శ్రీరంగ ఘట శాసిన
123 ః । కంచి ఘటశాసినః ॥ ఏతే కపిగోత్రాః । రేమన[33] ఘటశాసినః । విశ్వేశ్వ
124 ర ఘటశాసినః । మారె భట్టోపాధ్యాయాః । రామదేవ ఘటశాసినః ।
125 పల్లిభ ఘటశాసినః । తర్యే ఘటశాసినః । హరి ఘటశాసినః పంపయ
126 సోమయాజినః । పురాయి ఘటశాసినః । అన్నిక ఘటశాసినః (।*) ఏతేభ
127 రద్వాజాః ॥ మారె భట్టోపాధ్యాయాః । చరభ భట్టోపాధ్యాయాః ॥
128 ఆత్రేయాః ॥ రారిపెద్ది భట్టోపాధ్యాయాః ॥ (।) వెలుపుల పొ
129 తి ఘటశాసినః ॥ గౌతమాః ॥ అనంత భట్టోపాధ్యాయాః । మా
130 కన ఘటశాసినః । అప్పన భట్టోపాధ్యాయాః । కేశవ భట్టోపాధ్యా
131 యాః । మారె ఘటశాసినః । వామదేవ ఘటశాసినః । నరసింహ
132 ఘటశాసినః । దామోదర ఘటశాసినః । కేశవ ఘటశాసినః ॥ ఏతే కుండినాః (।*)
133 కందప్ప ఘటశాసినః । మారె ఘటశాసినః । పురుషోత్తమ ఘటశాసినః॥
134 ఏతే వాధూలాః ॥ మంచెన ఘటశాసినః । అనన్త ఘట శాసినః ॥ కాశ్య

ఆరవరేకు రెండవపెడ

## ఆరవరేకు, రెండవపెడ

135 పా ॥దేవన ఘటశాసినః ॥ శఠగోత్రః ॥ సర్వోదేవ భట్టో
పాధ్యాయాః ॥ తా

136 ండిల్యః ॥ ప్రతిద్విజవరేభ్యః భారి త్రయ పరిమితాం భువం
(మ్) ॥ ఇత

137 రత్పుష్కర్ మారాధ్య సర్వ్ క్రతుయాజీ విద్వన సోమయాజ
నామేన ॥ ౯

138 సామాన్యోఽయం ధర్మ్మ సేతుర్న్నృపాణాం కాలే కాలే పాల
నీయో భవద్భిః ।

139 సర్వా నేతాన్భావినః పార్త్థి వేంద్రాన్ భూయో భూయో
యాచతే రామ

140 చం ద్రః ॥ [62*] స్వదత్తాం పరదత్తాం పరదత్తాం [34]
వాయో హరేత వసున్ధరాం (మ్) ।

141 [35] షష్టిం వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః
॥ [63*] స్వదత్తా

142 [ద్వి*] గుణం పుణ్యం పరదత్తాను పాలనం (మ్) పర
దత్తా పహారేణ స్వద

143 త్తం నిష్ఫ (ష్ఫ) లం భవేత్ ॥ [64*] గామేకాం
రత్నికా మేకాం భూమేరప్యేక మంగులం (మ్) ।

144 హరన్నరక మాప్నోతి యావదాభూత సంప్లవం (మ్)
॥[65*] శత్రుణాపి కృతో ధర్మ్మః

145 పాలనీయః ప్రయత్నతః । శత్రురేవహి శత్రుః స్యాద్ధర్మ్మః
శ త్రున్న క

146 స్యచిత్ ॥ [66*] మద్వంశజాః పరమహీపతి వంశజా వా
పాపా దపేత మనసో భు

147 వి భూమిపాలాః । తే పాలయన్తు మమ ధర్మ్మ మిమం
సమగ్రం తేషాం మయా

148 విరచితోంజలి రేషమూర్ధ్ని (మూర్ధ్ని) ॥ [67*] పునరపి
విద్వనాచార్యే (ర్*) రోనపల్లిః పులుపర్తే [36] చత్రి(ర*)

## ఏడవరేకు మొదటిపెడ

149 ...త్తాంమితం క్షేత్రం లబ్ధ్వా తదుభయ ముత్తరేశ పురేంత

## ఏడవరేకు —మొదటిపెడ

భార్గవ వి... ...ద... (మ్) (।*) ...ం నామ

150 గోత్రే (।*) ...వ్వన... ...పాధ్యాయాః సార్ద్ధ ద్విభాగినః।
రుద్రే సోమయాజినః । ...రె ఘటవానః

151 అన్నిఘటవాసి... । పు... షోత్తమ భట్టోపాధ్యాయ సోమ
యాజినః । ...రె ఘ... పాధ్యాయాః । ...

152 వ భట్టోపాధ్యాయాః ...భాగినః । ఏ...హ... భాగినః [37]
వల్లభ సోమయాజినః ...భా

153 గినః । కవి ఘ...సినః ...రసింహ ...యాజినః । శ్రీరామ
ఘటవాసినః । ... యుగ్మ...

154 శ్వర ఘ అర్ధ (౯★) భాగి [39] । యెస్నేశ్వర ఘ అర్ధ్ భాగి । మారె ఘ అర్ధ్ భాగి । జన్నె ఘ పాదోన భాగి ।

155 ఏతే హరితాః । (।★) దేవరె భట్టోపాధ్యాయాః । రేమన భట్టోపాధ్యాయాః । కూచ

156 న భట్టోపాధ్యాయాః । మంచి భట్టోపాధ్యాయాః । నర సింహ ఘటశాసినః (।★)

157 పురాయి ఘ అర్ధ్భాగి । సోమేశ్వర ఘ అర్ధన్ భాగి (।★) కామదేవ భట్టోపాధ్యయా (।★)

158 ఎఱపోత ఘ అర్ధీ । నరసింహ ఘ పాదీ [40] । విశ్వేశ్వర ఘటశాసినః । జన్నె ఘటశాసిన (।★) అర్ధీ (।।★)

159 ఏతే భారద్వాజాః । (। ★) మూంకన ఘటశాసినః । సోమిది [41] భట్టోపాధ్యాయాః । విశ్వేశ్వర భట్టో

160 పాధ్యాయాః । గుండిమంచి ఘటశాసినః । దొజ్జ ఘటశాసినః భీమేశ్వర ఘటశాసినః

161 విశ్వనాథ ఘటశాసినః । లోంట సోమయాజినః । చెన్నె ఘట శాసినః । యస్నేశ్వర భట్టోపా

162 ధ్యాయాః । నాగదేవ ఘటశాసినః । కనకవెలి నరసింహ ఘ । నరసింహ ఘటశాసినః । వి[ద్య]

163 న [42] ఘటశాసినః । లర్ధీ ।। కందర్ప ఘ అర్ధీ । ప్రోలె భట్టోపాధ్యాయాః లర్ధీ । జన్నె భ [43] లర్ధీ ।

## ఏడవరేకు - రెండవపెడ

164 కోరెన ఘ అర్ధీ । ఏతె కుండినాః । (।*) గోకయ[44] భటోపాధ్యాయాః । గౌతమాః । (।*) ఎఱపోత ఘటశాసినః

165 । గర్గాః । (।*) కేశవ భట్టోపాధ్యాయాః పాదోనభాగినః । సోమనాథ ఘ అర్ధీ । జన్నె ఘ లర్ధీ (।*) ఏతే

166 ఆత్రయః । (।*) లన్నె ఘటశాసీ । కామన ఘ పాదీ । ఏతా లోహితా । (।*) కామన ఘటశాసీ । మారె ఘ

167 టశాసీ । ఏతా కాసి(శ) కా । (।*) పోలె ఘటశాసీ । కేశవ యజ్వా । అర్ధీ । నారాయణ ఘ అర్ధీ । ఏతే కశ్య

168 పాః (।।* ఉత్తరేశ్వర ఘటశాసీ । శట (ఠ) గోత్రః । (।*) జన్నె సోమయాజినః । వాధూలాః । (।*) శ్రీరామభ[45] అర్ధీ । పు

169 రుషోత్తమ ఘ అర్ధీ । విష్ణువృద్ధో(ద్ధా) ।। కందర్ప ఘ

ఏడవరేకు – రెండవపెడ

పాదీ (*) భారద్వాజాః । (*) ... పాదోన భాగి (।*) ...[46]

170 ... అర్ధీ । ... అర్ధీ ... వీర ... । శ్రీమద రాద్య ...

171 న భట్టోపాధ్యాయాః ... వాజపెయ బృహస్పతి

172 [47] ... (।*) ... ప్రవాహ ...

173 ... (*) ... అర్ధే ... మహాదేవ ...

174 హాదేవః త్రిభాగీ జనార్దనవల్లభః ద్విభాగీ అత్ర చ గ్రామే కుంభకార తైలకారాద్యష్టౌద

175 శజాతిభిర్య్యద్దేయం యచ్చాన్యస్మభ్యకం[48] తత్పూర్వ మేభ్య ఏవ విప్రేభ్యోదత్తం(మ్) ॥ బహుభి

176 ర్వసుధాదత్తా బహుభి శ్చాను పాలితా । యస్య యస్య యదా భూమిస్తస్యతస్య తదా ఫలం(మ్) (॥68*)

177 స్వస్తి శ్రీ దేవ్యై నమః [।*] * ౧

[ఛందస్సు : శ్లోకములు 1, 4, 26-స్రగ్ధర; 2, 3, 6, 8, 9, 13, 14, 16, 18-25, 27-32, 34, 38-41, 43, 46, 48, 49, 53-55, 63-66, 68-అనుష్టుభ్; 5, 42, 44, 51, 52, 57, 59-61-ఉపజాతి; 7, 50, 56, 67-వసన్త తిలకా; 10, 15, 33-శార్దూల విక్రీడిత; 11-ఇన్ద్రవంశ; 12-వంశస్థ; 17, 35, 36-పృథ్వీ; 37-పుష్పితాగ్ర; 45-మాలినీ; 47-రథోద్ధతా; 58-ఉపేన్ద్రవజ్రా 62-శాలినీ.]

## ల ఘో జ్ఞా పి క లు

1. ఈ వ్యాసము వ్రాయుటలో చాల సహకరించిన డా. పి. శ్రీరామమూర్తి గారికి మా కృతజ్ఞతాభివందనములు.

2. రెండు శాసనములలో ఒకటి కోన హైహయ గణపతిది. (భారతి, నవంబరు, 1959) రెండవది : ప్రతాపరుద్రుని వినాయకపుర శాసనము, చాళుక్య ఇందుశేఖరుని ఓసపల్లి శాసనము కలిసియున్నది.

3. శ్లో. 45 "యః ప్రాస్య స్వయ మిందుశేఖరనృపచ్చాళుక్యవంశోద్భవా దస్మై శ్వియ్య మదుత్తరేశ్వరపురం గ్రామం మహీభూషణం(మ్)

4. ఎపిగ్రాఫియా ఇండికా, 18వ సంపుటము, పుటలు 346-56.

5. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మ్యూజియములోని తామ్ర శాసనములు, 1వ సంపుటము, పుటలు 98-108.

6. ఈ పంక్తులలో విద్యానాచార్యునికి ఓసపల్లి, పులపర్తులలో భూమి లభించినట్లు, ఒది మరికొందరి బ్రాహ్మణులకు పంచి యిచ్చినట్లు చెప్పబడినది. ఈ రెండు యిచ్చినట్లు క్రీ. శ. 1291, 1296 శాసనముల వలన తెలియుచున్నది. అందుచేత యీ పంక్తులు 1296 తరువాతవి.

7. తార్కికుడు లేక, ఘటికాస్థానములోని అధ్యాపకుడు.

8. భట్ట మీమాంస బోధించు అధ్యాపకు (?)

9. ఇచ్చటినుండి ఘటశానికి 'ఘ' అని, భట్టోపాధ్యాయునికి 'భ' అని వ్రాయబడినది.

10. దక్షిణ హిందూదేశ శాసనములు (S. I. I.), 10వ సంపుటము, నెం. 360 జత్తిగ.
" 5వ సంపుటము, నెం.121 పాలకొల్లు

11. ద. హిం. శా., 5వ సంపుటము, నెం. 122 - పాలకొల్లు.

12. కాకతీయ ఆంధ్ర రాజయుగ చరిత్రము, పుటలు, 467, 488, కాకతీయ సంచిక, పు 57, కాకతీయ బాంధవ్యములు (భారతి, అక్టోబరు, 1970 పుట 34.)

13. కార్పస్, 13, నెం. 25.

14. కార్పస్, 13, నెం. 25.

15 ద. హిం. శా., 5వ సంపుటము నెం. 125 (క్రీ. శ. 1296) 124 (క్రీ. శ. 1296), 127 (క్రీ. శ. 1300) - పాలకొల్లు, కార్పస్, 13, నెం. 25.

16. ద. హిం. శా., 4వ సంపుటము, నెం. 1341,-1342 A, B, 1152.

17. దక్కను ప్రాచీన చరిత్ర, పుట 623.

18. ద. హిం. శా. 5వ సంపుటము, నెం. 122, 125- 127.

19. భారతి, మేనెల, 1974, పుటలు 4-7, స్టడీస్ ఇన్ ఇండియన్ ఎపిగ్రఫీ, 1వ సంపుటము, పుటలు.

20. భారతి, అక్టోబరు 1960, పుట 23.

## శా స న మూ ల ము

1. శాసనము, శాసన ప్రతిబింబములనుండి.

2. ఎపి. ఇండికా, 38, లో మొదటి పెడ క్రింద చెప్పబడింది. దీని వలన రేకుల వరుసలు, పేజీలు మార్చుకొనవలెను.

3. చిహ్నము.

4. ఈ పంక్తి మొదటిలో 15 అంకె వేయబడి ఉంది. (ప్రతి రేకు,) రెండవ పెడ ఆ రేకు వరుస సంఖ్య ఈయబడినది.

5. అర్ధానుస్వారముగా పరిగణించవలెను.

6. ఎపి. ఇండికాలో 'క్రోధాది వాగాద్దివమ్,

7. 'మేరు ధరాధరః,

8. 'మహీపతి'లోని 'మ' వరాలుగా వ్రాయబడి, ఒక గీటు చేర్చబడినది.

9. భాల (ఫల) విలోచనమ్

10. ఎపి. ఇండికాలో 'యత్ర'.

11. పాదోనిధివ్యద్దిగ్తా.

12. అనుస్వారము అవసరములేదు.

13. ఎపి. ఇండికాలో 'సంగరే'

14. పంక్తి మొదటిలో 2వ అంకె వేయబడినది.

15. యయా

16. రెండు గీట్లు వ్రాయబడినవి, కాని అవసరములేదు.

17. ఎపి. ఇండికాలో అన్ని చోట్ల విద్దనగా చదువబడినది.

18. పంక్తి మొదట 3వ అంకె గలదు.

19. విద్దనాయ్యాకాస్సద్ధి:

20. జనాస్సన్వేన్

21. ఎపి. ఇండికాలో 'శ్రీకంఠాచార్యున్' అని చదువబడినది. కాని 'శ్రీరంగాచార్యు' అని వినాయకపుర శాసనములోనూ (68వ పంక్తి), ఓనపర్తి శాసనములోనూ (131వ పంక్తి), కోన గణపతి ఖండవల్లి శాసనములోనూ (11 - 12 పంక్తులు) కూడా చెప్పబడినది.

22. ఎపి. ఇండికాలో 'భవద్యోనవ'

23. సురస్

24. పుణ్య ై

25. పంక్తి మొదట ఐదవ అంకె.

26. గీత అనవసరము.

27. అనుస్వారం అనవసరము.

28. ,,

29. గీత అనవసరము.

30. ఎపి. ఇండికాలో 'తెలాళ్ళ'

31. ,, 'ఘట్ట'

32. పంక్తి మొదటిలో 5వ అంకె.

33. ఎ.పి. ఇండికాలో 'కావుస'.

34. ఏటా అనవసరము

35. పంక్తి మొదట ఆరవ అంకె.

36. ఎ.పి. ఇండికాలో 'దాచపల్లి పులుగ్రా'

37. ఎ. పి. ఇండికాలో 'పస్న పాదార్ధకా భాగ:'

38. ,, 'తాటవి'

39. ,, 'పాదార్ధకా భాగే'

40. ,, 'సాద్ధకా'

41. ,, 'సామదేవ'

42. ,, 'పరస'

43. ,, 'మన్నెము'

44. ,, 'గారయ'

45. ,, 'ఘ'

46. ,, 'గోవు'

47. పంక్తి మొదట 7వ అంకె.

48. ఎపి. ఇండికాలో 'యచ్చాస్య వ్రతం'. పద్యకము ఉండవచ్చును. వినాయకపుర శాసనములో 'మద్వ్రత' మనివున్నది.
పద్యకం : ఉపస్థాది అస్తి.



# ఆత్మా - ఆవేశం

శ్రీ రామా చంద్రమౌళి

చేపలు గాలాన్ని మింగడం నేర్చుకుంటున్నాయి - యిక్కడి
  పసిపాపలు కాలానికి
ఎదురీదడం నేర్చుకుంటున్నారు.
ఇన్నాళ్ళూ —
మంచుదీపంలో మండని వత్తిని
అంటించేందుకు ప్రయత్నం జరిగింది
ఇప్పుడు
కండల్లోనుండి కాంతి,
కన్నుల్లోనుండి విక్రాంతి
ప్రవాహంలా పరుగెత్తుకొస్తున్నది
గతం ఓ మసకపట్టిన అద్దంలా...అందులో
నా ముఖం దయ్యం నీడలా—నేను
చీకటిని చీల్చుకుంటూ
కంకరరాళ్ళ బాటపై నడచి నడచి వచ్చే
నా పాదాలనుండి...గుండెల్లోకి చిమ్మే నెత్తురు బొట్లను
ఆ మబ్బు తునకపై ఎర్రగా దిద్దుతే,
నాలోని ఆత్మా—ఆవేశం గడ్డకట్టి
సూర్యుడు నిప్పుబంతిలా పైకొస్తున్నాడు.
నేను —
హృదయంలోనుండి కాంతిసారాన్ని తీస్తూ
ప్రపంచాన్ని నాలో దాచుకునేందుకు స్వర్ణాంబరాన్ని నేస్తున్నాను
ఇక్కడ...సంధ్య, నిశీధులు లేవు
అంతా ఉషఃకెరటాల వెలుగుపుంపరే
ఈ కాంతిని తాగి పలుకులా పడుకున్న నాకు
ఏవడో పిచ్చి వేటగాడు
వెలుతురు పిట్టంపై వేసిన వలను
కలిసికట్టుగా ఎత్తుకుపోతున్న దృశ్యం రమ్యంగా కనబడుతోంది

# నాకూ ఓ మనసుంది

శ్రీ వాడపల్లి విజయ భాస్కర రావూరావు

పన్నెండింటికైనా ఆఫీసుకు వెళ్ళకపోతే ఆఫీసర్‌తో గసాలా తప్పదు. రైలేమిటి, ఇంత మెల్లగా వెళుతోంది ?

—వాచీముళ్ళు చూస్తుండగానే జరిగిపోయి పదిన్నర చూపిస్తున్నాయి. జేబులో సిగరెట్లు చాలా సేపటి క్రిందే అయిపోయాయి.

రైలు ఆగిపోయింది.

"కాస్త దిగి కనుక్కొనివస్తా, సామానుమీద ఓ కన్ను ఉంచండి" — కళ్ళజోడు అమ్మాయితో చెప్పి రాళ్ళమీదకు దిగి గార్డు పెట్టె వరకూ నడిచాను.

"ఇంజన్ ఫెయిల్ అయింది. వాల్తేరునుండి మరోటి రావాలి."

"అతి దగ్గరఉన్న స్టేషన్ కోరుకొండ. మనిషిని పంపురారా?" నా ఆత్రం గార్డును నావైపు పరీక్షగా చూసేటట్టు చేసింది.

"మీరు కంగారు పడకండి మాష్టారూ, మాపద్దతులు మాకున్నయ్. మరో రెండు గంటల్లో ఇంజన్ వస్తుంది." — గార్డు గొంతులో కొంత విసుగూ, కించిత్ వైరాగ్యమూ వినిపించాయి.

ఓ లెవెల్ క్రాసింగ్‌మీద ఆగిపోయింది హౌరా—హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్.

రెండు గంటలు.

అంటే వాల్తేర్ వెళ్ళేసరికి, పదిన్నర — ఇంజన్ రావడానికి రెండుగంటలూ, వచ్చి వాల్తేర్ వెళ్ళడానికి మరో గంటా వెరశి మధ్యాహ్నం రెండయేటట్టుంది.

గొంతుతడి ఆరిపోయింది.

దూరంగా మర్రిచెట్టూ, ఎదురుగా సుబ్బాబు తలుపు తనపడుతున్నాయి.

కంపార్టుమెంటు దగ్గరకెళ్ళి కాసేపు తిరిగొస్తానన్నమాటని రెండుగంటల వార్తకి జోడించి చెప్పి మర్రిచెట్టు నీడవైపు నడిచాను.

నూతిదగ్గర తాటాకు 'రేక' తో నీళ్ళు తోడుకుని మొహం కడుక్కున్నాను. చెట్టుక్రింద పాకలో టీ దుకాణం కనపడింది.

"మంచి టీ చెయ్!" దుకాణం ఆసామీకి చెప్పి రుమాలుతో ముఖం తుడుచుకున్నాను.

గాజుగ్లాసులో జర్మన్ సిల్వర్ చెంచా గలగల లాడిస్తూ "బండి ఆగిపోనాదేటి బాబూ!" టీకొట్టు యజమాని పలకరించాడు.

"ఆఁ!" — దూరాన్నుంచి వస్తున్న గొడలవైపు చూస్తూ పరాకుగా జవాబు చెప్పాను. నాతోపాటు అతనూ గొడలవైపు చూశాడు.

"ఆగిపోద్ది బాబూ, ఆగిపోద్ది. మనం ఆగాలనుకుంటే ఆగదు."

అతని మాటలలోని ధైర్యం నా గుండెల్లో గుచ్చుకుంది.

"ఎందుకలా అంటున్నావ్ ?" ఆశ్చర్యంగా అడిగాను.

అతని సమాధానం మొదలైంది మొదలు దూరంగా ఇంజన్ కూత వినేంతవరకూ మంత్రముగ్ధుడిలా ఆశ్చర్యపోతూ విన్నాను.

ఆ వృత్తాంతం అతని భాషలో అతను చెప్పినంత హృద్యంగా చెప్పగలగడం అసాధ్యమని నా నమ్మకం. అతని ఆక్రందనా, ఆవేదనా అర్థంచేసుకోగలిగినందుకు ఇంకోళ్ళకి చెప్పకపోతే నాదే ఓ బాధేనా? మనసున్న మనిషి చెప్పకుండా ఉండలేని కదిలించే వ్యథ.

* * *

దురగాలమ్మ గుడిముందు పదిన్నర ఏళ్ళుంది రెండు చేతుల్తో కోడిపెట్ట పట్టుకుని గౌరమ్మ. ఈరోజేమి సేత్తన్నాయి కాడప లొట్టుకుని. మూడు మెట్లయినాక దురగాలమ్మ ద్వార దండాలెట్టారిద్దరూ.

"దురగాలమ్మతల్లి, నా సంబరాన్ని సూత్తావా!" పె మరిసిపోనట్టు మొగవెత్తేసిందమ్మాయి.

ఓపలంపూసి 'హాంపు" అన్నదిరపాడి

"రాయే పెట్టుకట్టుకో!" అన్నాడు మాటసేటంపూన.

కోపంవైపోనాది గైరమ్మ. మొగం దురగాలమ్మకేసి తిప్పేసింది ఈరాసావి.

సేతులెత్తి పెట్టను దురగాలమ్మకు సూపించుకుంది

జిగేలి మెరుస్తున్న కొడవలి కాసాకపాలీ, పెట్టమెడకాసాకపాలీ సూసి కరకరలాడించే సేడీరాసావి.

సేతులెల్తి దండాలెట్టారిద్దరూ.

–బుల్లిగాడు మాత్రం సోద్దెంగా గిలగిల కొట్టుకుంటున్న మొండెం ఏపు సూత్తన్నాడు.

బొల్బొన్నేత్తుకుంది గైరమ్మ.

ఎనిమిదేళ్లొచ్చినా ముచ్చటగా నోరు మెదపనేదు బులి గాడు. ఆడంటే దానికిపేనం. ఎవరూ సూడకుంటా ఎత్తుకుని ముద్దు లాడుతాది.

బొట్టిడికి మాయదారి రోగం ముంచేసి రెండేళ్లైపోనాది. మాటొడిపోయిందన్నాడు వొయిజ్జుడు. మాటేకాదు నడిపోత. గొంతూ సెడిపోనాది. గుటక పడక తికమడొడిపోలాడు. నోట్లో ఏం బెట్టు కున్నా కిందకి సగం కారిపోలాది. పిడికెడు మెతుకులూ, బుక్కెడు గంజీ ఆడికెట్టడానికి గంటొడతాది. ఆడికోసం కొదుకో కొడుకో అని గిలగిల్లాడుతాది గైరమ్మ.

ఈరాసావికి ఏదో పరాకు, మనసులో ఏదోసిరాకు. గైరమ్మను సూత్తే మతిపోతాది. సేవంవెట్టినట్టు బుల్లిగాడికి సుస్తీసేసిన రెండెల్లు తిరక్కుండానే టపీటపీమనిపోనారు మల్లమ్మా, నాగులమ్మా.

మంచం ఎక్కపోనేదు గాని కునుకెట్టడం మానీసింది గైర మ్మకి. గైరమ్మకి అండ లాటాకులింటి నూకాలు. శోకాలెదుతూ ఎఱ్ఱసెరువుఒత్తర గట్టునున్న ఏపసెట్టుమీది దెయ్యం బిడ్డల గొంతు నులిమిందని పూనకంలో సెప్పింది.

నూకాలికి గడిగడికి పూనకం వొత్తానే ఉంటాది.

ఏపసెట్టుమీది దెయ్యం ఈరాసావి కొసుక్కున్న గుడిసిలోని కన్నెపడుసు గైరి. గైరికి ఈరాసావంటే పేనం అని సెబుతుంటాది నూకాలు.

గైరమ్మలో గైరి పోలికలు సూసుకోడం నేర్చుకున్నా డీరా సావి. గైరి సావెనకాల నిజం నూకాలు పూనకంలో ఓనాదు పొక్కి పోనాది.

లయ్యాలాదివోరం. ఐదేళ్ల మల్లమ్మెలిపోనాది సారగానికి. గడపమ్మీద సోకాలెడుతున్న నూకాలు నేచి నుంచుంది. కళ్లు సింత నిప్పుల్లా కణకణలాడిపోతున్నాయ్.

నీ సిగదరగా, గైరీ, నీకు నేకపోతే నేకపోయె. ఎవడికేది అను బోగమో. వట్నంవెల్లిపోయినోడు ఎల్లేపోనాడు. ఆడిమీద మనసు సంపుకోనేక డిని బొట్నిని పొట్టనెట్టుకుంటావటే! నీ జిమ్మడ! గైరమ్మనాంటి మనసుందె? ఏనాడైనా నీమీద ఏపైనా అనుకుందా? ఈరాసావి నీకేటి దోహం సేసినాడనీ, కచ్చవేసుకుంటున్నావ్! కులికి సన్నాళ్ళు కులికేవ్! నీ పేనం తీసుకోనున్నాడటే ఈరాసావి. నంజ కానా, గైరమ్మ వుసురు నీకు తగలకుండుంటాదా? దయ్యమై సాది స్తావటే, నీ సిగదరగా!"

నూకాల మాటవిని మూవిడి తోటలోకీ జారిపోనాడు ఈరా సావి. శివాలెత్తిన అమ్మోర్లా నలిక సాపుతున్న నూకాలేపు సూసి దిక్కు తోచనేదు గైరమ్మకి.

"నానేటి సేతున్నోయ్ బగమంతుడా, ఈ గైరెవర్తిరోయ్– దెయ్యం దెబ్బతినీసేవ్ కూతురోయ్!"

తల్లికాసి సూస్తూండిపోనాడు బుల్లోడు. రెండు కన్నీటి బొట్లు ఆడి నోటమ్మటొచ్చే చొంగలో కలిసిపోనాయ్.

మరో నెల తిరగనేదు. నాగులమ్మకి ఒల్లిమాలిన సలిపరం. ఒళ్లు మరిగిపోనాది. మూసిన కన్నెత్తనేదు. చెల్లిమల్లెమ్మ ఎఱ్ఱి సూపు సూత్తండగా గూడేపు తిరిగిపోయిన నాగులమ్మకు అపస్మారం ఒచ్చి ఒళ్లు ఒంపరమెత్తేటట్టు గావుకేక లెట్టేసినాది. ఒంటిమీద ఒడ్లగింజేస్తే పేలగింజవుతోంది.

"ఓలమ్మో! నాగులికి పాము కరిసేసిందోలమ్మో!" అని కెవ్వుమ కేకేసి కళ్లు మూసేసుకుంది.

ఈరాసావి కొక్కపొలి లెలిలి తెల్లారిపోనాది. సైకి లేసుకుని యిజీనారం లగెత్తుకెళ్లాడు డాట్రు దెగ్గిరికి.

కారేసు కొచ్చేడు సంటివి డాట్రు. ఎనక కంపోడ్రూ ఉన్నాడు. బాసలో ఏదేదో అన్నాడు. సూదిమందు లిచ్చాడు. మూడు గంటల సేపు బొట్టికాడే కూకున్నాడు. గైరమ్మకి ఒక సిటం ఊపిరాడనేదు. ఇటు డాట్రు సేవ, అటు బొట్టి సేవ.

పొద్దుకూకులా కూకున్న డాట్రు నాగులమ్మమీద గుడ్డకప్పి మరీ ఎల్లిపోనాడు, ఆ రేత్తిరికే మల్లొచ్చింది నూకాలికి పూనకం. ఊరంతా అట్టుడికిపోనాది.

"అవునేగైరీ, నీకేటి పొయికాలవంటే, ఆడికాడికి పోయుంటే నిన్నెవడడుగునే, నంజకా, ఆడ నాబిడ్డల్ని పొట్టనెట్టుకుంటావటే-

ఆడు నీ బిడ్డని సంపుకోమన్నాడంటే, ఆడికరమాన్నాడెల్లిపోనాడు. కులికిన గుడిసేటేవి ఆడిలో సెప్పొద్దూ పీకలమీద కొచ్చిందని, యిజీ నారానినే ఈడనే ఏళ్లా, గెడ్డలా ఎల్లి సెప్పనేకపోనావా? ఇదేటిదే, ఇలా అందర్నీ పొట్టనెట్టుకుంటావుటే, ఆ మూగనాయాలు అణ్ణి తీసుకుపోరాదటే, నోరునేక పడున్నాడు, రతనంనంటి బొట్టి, దీన్నెత్తుకుపోయేవే, నీ సిగదరగా!''

ఆకాసంనోకి సూత్తుండిపోనాది గైరమ్మ.

ఈరాసాంవి కంటతడి ఇగిరిపోనాది.

గైరమ్మలో గైరినిసూసుకునే ఈరాసాంవి నూకాల పూనకం లోని పేలాపన విని గైరిమీద మనసులో సేదు నింపుకున్నాడు.

పూనకం విడిసేసిన తరువాత తనకు తెలిసిందంతా గైరమ్మకి సెప్పేసింది నూకాలు.

—ఈరాసాంవిమీద రంగైపోయింది గైరి. ఉన్నట్టుండి ఈరాసాంవి యిజీనారాం ఎల్లిపోనాడు ఫేక్టరీలో పన్జేయ్యడానికి. అంతే మరి రానేదు. ఆడికోసం సూసి సూసి రెండేళ్లెల్లినాక నూతులోకి పోనాది గైరి. నీళ్లమింగేసింది నంజ కడుపుబ్బి పోనాదన్నారందరూ. గైరి తల్లెప్పుడో పోనాది. తండి మంచవొట్టిపోయి గుటుక్కుమన్నాడు. గైరి తమ్ముడు కొంపమ్మేసుకుని పట్నం పెల్లిపోనాడు. ఈరాసాంవీ కొంపకొనుక్కుని నిన్న కట్టుకున్నాడు.

ఈ మాట విన్నాక మరి ఆడితో నిద్దర పెయ్యనేదు గైరమ్మ.

నూకాలికీ జాదగానే ఉండేది గైరమ్మ ఒరస. సీకాలెడుతూనే ఉండీది గడపమ్మీద కూకుని. గైరిని సేపనాకారాలెడుతూ.

''గుడిసెట్ నంజా, నీ జివానికుసూరుమంట్లా ఇద్దరు బొట్టెర్ని నీ కర్సింది ఆ రోగిష్టెదవకోసం పేనాలెడుతుందే బొట్టి, గైరమ్మ. కంటికున్నసుకు నేడు. నీ కచ్చ తీరుసుకోడానికి ఆ బుల్లోడి నాదిరిసేవ్ గదే, మరి గైరమ్మకి సుకంనేదా?''

—ఎండ బడొచ్చిన బుల్లోడి పాటలిన్నాడనీ, ఆడికో మనసుందనీ తెలుసుకోలేక పోనారెవరూ.

—ఇది చెవినబడ్డ గైరమ్మ తోక తొక్కిన తాములా లేచింది.

''బుల్లోడినకప్పా! ఆడికరము, నా కంటంపో పేనపుంగా ఆడి కేసోటూ సెయ్ను. —ఆడే నాకన్నీ. బొట్టెడి మీది పమకా రంతో ఈరాసాంని కళ్లల్లో నీళ్లు నిండేయ్.

— నూకాలప్ప సెప్పింది నిజం. దీని పిగదరగ తనమీద

కచ్చుకొద్దీ గైరమ్మనీ బొట్టిగ్నీ సతాయించి సంపులోంది. పిల్లల్ని తినేసింది. తననేటి లెరివి తక్కువోడు !

అర్ధరేత్తిరి పెడపులాంటాలోసనొచ్చి దిగ్గున మంచంమీద లేచికూకున్నాడిరాసామి.

''ఒలేయ్ !''

బొంతమీదనుంచే అడిగింది కునుకు మరిసిపోయిన గైరమ్మ ఏటిమావా ?'

'ఇక దీని ఆట కట్టించేత్తా, పద రేపే ఎల్దాం కొత్తూల్సి. పాత వయిజ్జుని కాడికి. దీని పని పట్టించేత్తా. పడవటింటి పాలా తూర్పిన బాపతు మ్మూడొంధలూ బట్టుకెళదాం.''

—బుల్లోడికి ఒయిజ్జుడంటే కారుమీదొచ్చిన డ్రాటేగేపకం.

నూట పదార్లుచ్చుకున్నాడు పంతులు. కరుసులైనాయి మరో ఒంద. నాలుగురోజులైపోనాక ఒయిజ్జమైపోనాది ఇంటికెల్లి పొమ్మన్నాడు.

గైరమ్మ కొండందుకుంది. పీడ ఇరగడైతే బుల్లిగాడికి మామూలు మాట రావొచ్చు. బుల్లిగాణ్ణి మేట్టురు కాడెట్టాల కొత్తూల్సలో బయల్దేరేముందర పలకా పుల్లకొంది. కుసింత దూరం ఒచ్చినాక యాదసొచ్చి ఎనక్కెల్లి ఓ పెట్టెడు పుల్లలుకొంది. ఓ రెండు కమీజులూ, రెండు సెడ్డీలు కొంది. బగమంతు డిచ్చిన కాడికి బొట్టిడికేపోట్టూ నేకుండా సూసుకోవాల.

అబ్బ ! ఇక గైరి పోరొదిలినట్టే —

ఈరసామి దోవలో టీకొట్టుకాడ టిపినూకాపీ ఇప్పించినాడు గైరమ్మకి. సొరోజులికి తృప్తిగా ఇంత తిన్నారు. సిరిపిగా మెరుస్తున్న కళ్ళలో గైరమ్మకేసి సూసినవ్వేడు. గైరమ్మ బొట్టిడికేసి సూసింది.

—'అమ్మా', గైరమ్మకి మాత్తరం లిరిసేబాసలో అనిగాడో నాడు.

''ఏట్రాబుల్లీ !''

''మరేంనేదే, మనింటోనూ ఓ బుజ్జెమ్ముంటే ఎంత బావుంటాదే,'' సూకాలప్పు బొట్టిగూనంత కడుపులో ఒచ్చి పోరం వెల్లకుండా తిన్నరెత్తుకుంది

ఏటుష్టానీ అడి తల నిమిరింది గైరమ్మ.

ఆమె సారానికి అరదం తెలుసుకోనేకపోనాడు బుల్లోడు.

గైరమ్మ కా ఆలోసనొచ్చినప్పుడల్లా బుల్లోడిని గుండెకద్దుకుంటుంది.

— రైలుపట్టాలపక్కబడి నడుస్తున్నారు ముగ్గురూ ! ఈరాసామి సెత్తో టంకు పెట్టీ మునకాలక్రా. గైరమ్మసేతిలో సంచీ బుల్లోడు మెల్లగా నడిసొస్తన్నాడెనకాల.

తుప్పెనకాల కెల్లింది గైరమ్మ.

ఇదిగో ఈ భూతంవే లగెత్తుకొచ్చింది. ఓసిటంలో అంతా జరిగిపోనాది. బుల్లోడు రెయిలుకింద కెలిపోనాడు. తలకి తలా, మొండేనికి మొండెవూ. బండి ఆపనైనా ఆపనేదుబావూ.

— బావురు మన్నాడు టీకొట్టుమనిషి.

చెమటలు కక్కుకుంటూ వచ్చాడు మరో మనిషి. దూరాన్న లైను దగ్గరే కడుతున్న గోడల దగ్గిర్నించి. మన్ను కుమ్మిన కాళ్ళు నూతి దగ్గర కడుక్కుని మళ్ళీ వచ్చాడు కొట్లోకి.

''ఈరాసామీ ! ఓ రెండు పుణుకులెట్టు !''

ఆశ్చర్యంగా తలెత్తి చూశాను.

పుణుకులు ప్లేట్లో పట్టుకుని ఓ మూలకెళ్ళి తింటున్నాడు మన్నుకుమ్మేటూ వచ్చిన పనివాడు.

కొంచెం తటపటాయించి మళ్ళీ ప్రారంభించాడు ఈరాసామి.

''అసలు గోరం తమరింకా ఇననేదుబావూ; మీరు. గైరమ్మ మతి పోయినట్టయిపోనాది. అదే రేత్తిరీడనే ఒచ్చి గూడ్సుకింద పడిపోనాది...నాకు ఇక కొంపెందుకు బావూ ! అన్నీ ఒదిలీసుకున్నా. ఈ కొట్టు కొనుక్కుని, నా గైరమ్మనీ, నా బుల్లోణ్ణీ సూసుకుంటూ కూకుంటున్నా, పొద్దుగూకులా ! - లదిగో పేరంటాలు గుడి లేచిపోతోంది.''

కళ్లొత్తుకుంటూ ''పిరాస్వామీ, నీకు భగవంతుడే అన్యాయం చేశాడు'' అన్నా. కరుణాట్నుడికి నిస్సహాయి చూపించే మొండి చెయ్యిలాంటి శుష్క ప్రియం, ఊరడింపుమాట

అవసరానికి ఆగని రైలు, నా అవసరం దాటాక బద్దకంగా ఆపులించి కదిలింది.

# సంశోధిత మహాభారతము -
# అప్పకవి పాఠములు

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

లక్ష్యమున్న గాని లక్షణ మేర్పడదనుసూక్తి ననుసరించి. తెలుగు భాషలో నన్నయ భారతావతరణమునకు తరువాతనే కవి జనాశ్రయమను ఛందోలక్షణ గ్రంథమును, ఆంధ్ర భాషాభూషణమను వ్యాకరణ లక్షణ గ్రంథములు వెలువడినవి.[1] వీనిలో ప్రస్తుతము మనకు కావలిసినది ఛందోలక్షణ గ్రంథము. కవిజనాశ్రయకారుని కాలము నుండి లాక్షణికులు యతిప్రాసల పరిణామమును తమ తమ కాలములకు ముందు లభించిన కవిప్రయోగములనుబట్టి లక్ష్య లక్షణములను సమన్వయముచేసి, నన్నయాది పూర్వకవుల యతిప్రాసలను సంరక్షించిరి.

కాని క్రీ. శ. 1656లో అప్పకవి నాటినుండి కవి ప్రయోగ సంప్రదాయసిద్ధమైన యతి ప్రాసల విషయమై యొక భిన్న సంప్రదాయ మేర్పడినది.

అప్పకవి "ఆంధ్రశబ్ద చింతామణి"[2] యను తన లక్షణ గ్రంథమున—నన్నయభట్టు యతిప్రాసలను గూర్చి చర్చించుచు నిట్లు వ్రాసినాడు.

> "నన్నయ ముఖ్యసత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
> గొన్నియుఁ బాఠకాధములు గొన్నియు బోకడపెట్టి తక్కువై
> యున్నెడఁగాంచి జానపదు లొడకదిద్దిన తప్పులోవలె
> ల్లన్నిజమంచు గైకొనిన లక్షణ వేత్తలు సమ్మతింతురే
> (3-203)

ఇట్లు వ్రాయుటయేగాక, "బహుపుస్తకంబులు పరీక్షించి వానినెల్ల బక్షిప్తంబులుగా నెఱింగిన వాడనై" యని కూడ స్పష్టముగా చెప్పినాడు.

ఇందువలన అప్పకవి నాటికి తాళపత్ర ప్రతులలో భారత పాఠములు ప్రక్షిప్తములని యర్థమగుచున్నది.

ఈ అప్పకవి వ్రాత సత్యాసత్యములను పరిశీలించుటయే యీ వ్యాసోద్దేశము.

## భారత పాఠములు-అప్పకవివివారు

అప్పకవి తాను బహు పుస్తకములు చూచినాడనని యన్నాడు. గదా ఎన్ని చూచినాడో చెప్పలేను చూడకుండగనే దిద్ది, క్రొత్త పాఠములు కల్పించినాడని ఈ క్రింది విషయమునుబట్టి నిస్సంశయముగా చెప్పవచ్చును.

సంశోధిత మహాభారత ముద్రణము.

ఉస్మానియ విశ్వవిద్యాలయమువారు-౩[illegible] యేండ్లనుండి తెలుగున ప్రచారముననున్న భారత తాళపత్రులు లెక్కించి వానిని కాలక్రమమున నేర్పరచి అందు 25 ప్రతులు ప్రధానముగా గ్రహించి, తక్కిన వానిని సంప్రతించుచు, పాఠభేదములను ప్రదర్శించినారు.

సంశోధిత ముద్రణమున పై తాళపత్ర పాఠ ప్రదర్శనము ముఖ్యముగా నన్నయ యతిప్రాస సంప్రదాయమును నిర్ణయించుటకు మనకెంతో తోడ్పడుచున్నది. సంశోధిత ముద్రణమున నన్నయ భారతము-ఆది సభా-అరణ్య పర్వభాగము-శేషము ఇప్పటికి-7 ఏండ్ల క్రిందటనే ప్రకటితమైనను-సంశోధిత ముద్రణ పాఠములను అప్పకవి పాఠములతో సరిచూచు పరిశ్రమ జరగలేదు.

అట్టి దాని కిదే ప్రారంభము —

దీనివలన-అప్పకవి నన్నయ పాఠములను, తాళపత్ర ప్రతులు పరిశీలింపకుండగనే, ఎట్లు మార్చినాడో—కొన్ని పట్టుల తన మతమున కనుగుణముగా క్రొత్త పద్యమును వ్రాసి నన్నయపేర భారతమున నెట్లు ప్రక్షిప్తము చేసినాడో ఏ తాళపత్ర ప్రతులలోను కనుపించని క్రొత్తపాఠముల నెట్లు సృష్టించినాడో సాహిత్య లోకమునకు విశదము కాగలదు.

లేఖకులు, పాఠకులు—లక్షణ గ్రంథకర్తలు భారత పాఠములు ప్రక్షిప్తము చేసినారని బాహాటముగా చాటిన అప్పకవి తానే,

ఆ మార్గము ననుసరించినాడని కూడ యిందువలన తెలియగలదు.

దీనినే "ఒజ్జల పుచ్చకాయ" యందురు.

'వికృతి' అను పదము తొలుత తెలుగున ప్రవేశపెట్టిన లప్ప కవి, భాషవిషయమున నెట్లున్నను ప్రకృతి సిద్ధమైన నన్నయ పాఠములను నెట్లు వికృతముగా చేసి, నన్నయ యతిప్రాసల నెట్లు పులిమి పుచ్చినాడో ముందు చూడగలరు.

ఇపుటికి నూరేండ్ల క్రిందటనే అప్పకవీయ తృతీయాశ్వాస విమర్శనము ప్రారంభమైనది. కూచిమంచి వెంకటరాయకవి, సుకవి మనోరంజనము అనే తన గ్రంథమున అప్పకవీయమును ఖండించి నాడు. దానిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ముద్రించు చున్నారు.

ప్రస్తుత వ్యాసము, సంశోధిత మహాభారత పాఠములకు మాత్రమే సేమితమైనది–తొలుత యతులనుగూర్చి విమర్శించెదను.

# 1. అభేదవిరతులు

"వేదముఖమున 'వబయోరభేద' యనుట
వలన వబలొక్కటొక్కటి విలుచు విరవి
కవనిలడలకు లళలకు నట్లు కలిమిఁ
జేసి తమలోన నవియును జెల్లుచుండు. (87)

"సుతజల పూరితంబులగు నూతులు నూటిటికంటె సూనృత
3 4
వ్రతయొక బావిమేలు మది బావులు నూటిటికంచె"

(ఆది. 4-94)

సంశోధిత ముద్రణమున – 'బావి' 'బావులు' అను రెండు పట్టులను పాఠభేదములు దాహరింపబడినవి. 3 వాపి. ఎ. క. ప. స. 4. వాపులు–ఇ, వి, క. మ. స. (పుట 203)

అయిదుప్రతులలో వాపులని కలదు.

దీనినిబట్టి–నన్నయ–'వాపులు' అనియేగాని బావులు అని వాడ లేదనుట స్పష్టము. ఈనాడు మనకు "వావులు" ఇంపుగా కని పింపకపోవచ్చును కాని నన్నయ బావి శబ్దము వాడనేలేదు – అటులనే సీ. పా. బహువిధాగారముల్ ప్రమదవనంబుల

వాపుల దీర్ఘికావలుల వెలసి (స. భా. 1-283)

(సూని. 7వ సం. వాపి శబ్దము క్రింద పై ప్రయోగమీయ బడినది)

అని వాపి – యతిస్థానమున ప్రయోగించినాడు. వాపి శబ్దము – ధర్మశాస్త్రప్రయుక్తము.

"ద్వారహీనో భవేత్కూపో
ద్వారేణై కేవ వాపికా"

| | |
|---|---|
| బావిశబ్ద ప్రయోగము శ్రీనాథుని కాలమునుండి మాత్రమే గలదు. ధరణీధరము పొంతతల్లి బాలి. కాశీ. 3.27 | తత్త్వరత్నాకరము – (ఎ. ని.) సూ. ని. 5 సం. 1130 పుట |

వ్యవహారమున పూర్వపు న్యాయశాస్త్ర పత్రములలోను "వాపీ కూప తటాకారము" – అని వ్రాయించెడివారు. ఇప్పటికి పల్లెలలో నిది వ్యాప్తిలోనున్నది.

పై పద్యమున – బావులు – అను పాఠము అప్పకవి కల్పిత మని మఱియొక హేతువుచే నిరూపింపవచ్చును –

వ కారము ఏక తరయతికి చెందినది–ఇది మఱియొక పల్లుతో యతి మైత్రిలిఁదదు –

మరఁలప – కవి జన్మాశయము
మరఅలప – విన్నకోట పెద్దన
శర మఱవ – అనంతుడు
మరఅలవ – చిత్రకవి పెద్దన –

ఇట్లు తనకు ముందుగల లాక్షణికులు – 'వ' ఏకతర యతి క్రింద పరిగణింపగా, లప్పకవి ఈయతిని విస్మరించి – వకారమునకు 'బ'తో యతి నన్నయ ప్రయోగములోనే చూపుట శోచనీయము –

ప్రాచీన లాక్షణికులు – ఏకతరయతి క్రింద పరిగణించిన వర్ణ ములకు నితరాక్షరములతో యతి ప్రయోగములు లేకపోవుటవలననె యని గ్రహింపవలెను – ఏకతర యతులకు పూర్వకవుల లక్ష్యములు – చూపబడలేదు.

లప్పకవి నన్నయ చింతామణి కర్తృత్వము నారోపించుటకు చేసిన – ఛందోలక్షణ మిది – నన్నయ 'వాపి' శబ్దము తప్ప 'బావి' వాడలేదు – నన్నయలో వ. బ. యతి సరిగదా, ప, వ యతులును లేదు –

## ii

ప్రతిబలి దర్పభంజనుఁడు పార్థుఁడు... ... ... ...
... ... ... ... మహాంబు వృష్టిప
ర్యుతము గ్రహించునట్లు తన బాహుల వాని గ్రహించి

ఆ. క. 1-3.41

సంశోధిత ముద్రణమున –

1) చ ... ... ... ... ... ... ప
ర్యుతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి.

అని పాఠమే మూలమున గలదు –

పుట యడుగున (74) 5. తన బాహులవాని గ్రహించి అన్. ఒ. ఛ –

ఇందు — అక అనగా అప్పకవి — అప్పకవి. అతనినసుసరించిన మఱి రెండు ప్రతులలో తప్ప – 'బాహుల' అను పాఠము లేదని పైదాని కర్ణము–22 తాళపత్రములలో లేదని నిర్ధారణ –

నన్నయలో వలపలగింక యతిని నియతముగా పాటింపబడినదని యూవటకే — తెలిపియున్నాను.[3]

ప్రాచీనులైన కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణికర్తృవి అభేదయతి చెప్పకపోవుటకు కారణము – నన్నయ భారతమునందట్టి ప్రయోగములు లేకపోవుట చేతనేయని యెఱుగవలెను – భావప్రకాశిక[4] — (పుట 75) రో నిట్లున్నది "ఈ యతి ప్రాచీన మతముగాదని నేదు కొందఱు భారతమునుండి యభేదయతి కొసగిన లక్ష్యములలో పాఠాంతరములు పఠించి యభేదయతి లేదందురు – ఆ పాఠభేదము లీ క్రిందివి —

| | |
|---|---|
| ప్రత — వాపులు | (బావులు పూ. ము) |
| ర్వత — వంతుడు | (తన బాహుల పూ. ము) |
| వల్ల — నెపంబు | (నెపంబున—పూ.ము) |
| వర — వాని | (పరత — పూ ము) |
| అవా — వారికి | (పార — పూ. ము) |
| వీరు - వివే | (విభేదమెన్నడు పూ. ము) |

అభేదయతినివారించుటకై చెప్పబడు పాఠాంతరములు సహజముగ, స్వరసములుగం జూపట్టుకున్నవి ఆపైని ఈ పాఠముల సామంజస్య మెట్లున్నను అని వ్యాఖ్యాతలు శంకించిరి. దీనికి సమాధానము.

1) ప్రాచీన లాక్షణిక ఏకరర యతి సంప్రదాయము
2) నన్నయ యతి ప్రాసతత్త్వము
3) తాళపత్ర పాఠ ప్రామాణ్యము –

ఈ మూడు నెఱుంగక — అప్పకవి చెప్పినదే - పరమ ప్రమాణమును కొను వ్యాఖ్యాతలు పై రీతిగా వ్రాయుటలో వింతలేదు -

యతిప్రాసల విషయమున కవిత్రయ. శివకవిత్రయ. శ్రీనాథుల తప్ప తక్కినవారి ప్రయోగములు యతిప్రాస తత్త్వ పరిణామమును దెలపవు.

పై వ్యాఖ్యాత పాఠములను విమర్శించుచున్నాను.

## 2. అభేదవర్గ యతులు

"తనకడచేసి బకారం
బునకు స్వవర్గజములైన మొదలి లిపుల రెం
టను బైలిపి నొకటను వా
యానువాయియ భేదవర్గ యతి నానెనయున్ (98)

ఇందు పకారము, ప, ఫ, బ, భంలో యతి చెల్లునని లక్షణము ఇందు నన్నయ భారతమునుండి 4 లక్ష్యములున్నవి.

లక్ష్యము లు :–

1) భూ వల్లభ తక్షకాదము నెపంబున – ఆది 1–128

వల్లభ తక్షకాధము నెవంబున – అని పాఠము. నెవము శబ్దము శ్రీనాథుడు నిర్ధారకముగా ప్రాసయందు వాడినాడు –

చివ్వరు కెమ్మోవి చిఱుగాటు నెవముగాగ –
సంశోధిత ముద్రణము. దీనిని చూపెట్టినది.

(నైష–7–47)

సూ. ని. నెవము - అనియే గ్రహించినది. 4 సం–పుట 877.

ఎఱుఁగ తత్సేను తాత్పర్యంబు తగ నెవంబున
(హరి. పూ. 1–37)

కావున ప-వ యతిలేదు.

2) పరమధ్యానో

పరతేంద్రియ వృత్తినున్నవాని శమీకున్ (ఆది. 2–172)
"ధ్యానా వరతేంద్రియ వృతి నున్నవాని శమీకున్."
(సంశోధిత ముద్రణము)

ధ్యానా వరతేంద్రియ వృత్తి; పెక్కు పతులు (పుట 94)
కావున నిచట స న యతి లేదు.

3) క కోగి యా నేక యుగంబుల
పారతపో యుక్తునై నెవ్వారికి ఆది 1 371
ఇవ్వటను అవార తపోయుక్తులని పాఠము.
సంశోధిత ముద్రణము

నారిత శరసమితి — వ, ల, వ – ఈ పాఠమున పవ యతి వారింపబడినది (పుట 45) పై తాళపత్రులలో-'ల' బౌసుదొర పెక్కు తాళపత్రపాఠములనుబట్టి నిర్ణయించినది.

4) వీరు వారనునట్టి బుద్ధి విభేదమున్నడులేదు (ఆది. 8–29)
సంశోధిత ముద్రణము (పుట 432)

వీరు వారనునట్టి బుద్ధి వివేక మెన్నడు తాళ కొన్ని పతులు.

అని తెలిపినది – నన్నయ నియమమునుబట్టి ఇందు "వివేక మెనుడులేదు" అనియే సరియైన పాఠము –

## 3. యుష్మదస్మచ్ఛబ్ద యతులు

క. క్షితి నస్మద్యుష్మత్పద
యుతులనంగా పరగు యుష్మదస్మచ్ఛబ్ద
ద్వితయమునకుం బ్రాణము
లలిపిన దుభయంబు చెల్లు నభయవిదూరా

వి. అస్మద్ — యుష్మద్ అను శబ్దద్వయమునకు స్వరము పరమై సంధియగునపుడు నయయతి చెల్లును —

దివ్యతపోవన పర్యటనోత్సుకాగమునన్.

అరి పేరు యోగ్యనిట్ల్యురమైన్ సెంబో –

2 ధర్మరనయు యువరాజ్యాభిషేక-అధ్యయనపరాట

3 ఆది పర్వము (2-219)

ప్రస్తుత పంక్తి స్థితియు

ప్రతాపమునుమైన యసురాదుల కెల్లన్ (పుట 93)

సంశోధిత ముద్రణమున –

"పయోజనేత్రా – అ. ఆ ఈ ఉ ఏ. ఐ. ట అను పాఠము గలది – ఇది 7 ప్రతులలోనున్నది." (పుట. 106)

తాళపత్రప్రతులలో –

"ప్రస్తుత పంక్తిస్థిత కాయా

యుత్తమమైన యసురాదులకెల్లన్."

అని స్వర యతులయందు అంటువేసి-ఉన్నపాఠము సరియైనది – నన్నయ యిట్టి యతిని నుపయోగించి నాడని చెప్పుటకు కల్పింపబడినది –

## 4. నిత్యసమాస విశ్రాంతులు

నారాయణ శబ్దమునకు

ఆదిపర్వమునందు (1-25)

ఉ. సాయక పాతకాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దాసును దరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ తన కప్పుడున్ సహో
ద్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్

జా. పు. పుట 125-126లో–ఇందు నారాయణ శబ్దమునకు స్వరవ్యంజన యతులు రెండును నున్నట్లు వివరింపబడినది.

అప్పటి నన్నయ కాలమునుండి నన్నయ రచనగా యీ పద్యముదాహరించినారు కాని–ఈ పద్య స్థితి తాళప్రతులలో రెండువిధములుగా నున్నది.

1) కొన్ని తాళపత్ర ప్రతులలో అసలే పద్యములేదు.

అవి. ఆ, ఇ, ఊ, ఎ, ఐ, ఓ, ఔ, క, చే, చో, ట, ఠే, త, బ. 14 ప్రతులు,

2) ఈ పద్యమున్న తాళపత్రప్రతులు.

ఈ, ఉ. ఒ. క, గి. చ, ఐ. ట, శ, ష. 10 ప్రతులు.

ఈ పది ప్రతులలోను పై పద్యము–సారమలింగవీంద్రుదు అన్న పద్యము తరువాత వ్రాయబడినది. కాని అన్వయమగుటలేదు– సంశోధిత ముద్రణము. (పుట 8.)

పై తాళపత్ర ప్రతుల వివరణములనుబట్టి నన్నయ భారత మున నీ పద్యము లేదంత లేదనియు తరువాత అందు చేర్చబడె నదియు స్పష్టమగుచున్నది. స్పష్టమగుటయేగాదు. ఈ క్రింది యుపపత్తులవలన అది ఇతర కవి రచయిరమైన యిందు చేర్చబడెనని నిశ్చయాత్మకముగా నిరూపించుచున్నాను.

## i

ఈ పద్యములేని తాళపత్ర ప్రతుల సంఖ్య–ఈ పద్యమున్న దానికన్న హెచ్చు–లేనివి 14. ఉన్నవి–10.

## ii

ఈ పద్యమున్న తాళపత్ర ప్రతులలో ప్రస్తుత ముద్రణ ప్రతికి విరుద్ధముగా "సారమతిన్" అన్నపద్యము తరువాత నున్నది.

అందుచేత సమన్వయము కారేదు. స్పష్ట ప్రతిపత్తికి-పై పద్యము ముందు పద్యము, తరువాత పద్యము నుదాహరించుచున్నాను.

మఱియు

చ. పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజవారిజో
త్కరరుచిరంబులై, సకల గమ్య సుతీర్థములై మహా మనో
హరసుచరిత్ర పావన యశఃపరిపూర్ణములైన సత్సభాం
తర సరసీ వనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకనే 24ప.

ఉ పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరాసుర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుఁన్ దన కిష్టుఁడుఁన్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.
25 ప.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరులక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్–26 ప.

ముద్రణలో 24 పద్యమున "సత్సభాంతర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్"–అను అసమాపక క్రియ యున్నది–

25 పద్యమున తన కిష్టుఁడున్ సహాధ్యాయుడునైన వా డభిమతంబుగ తోడయి నిర్వహింపఁగన్–అను అసమాపకక్రియ యున్నది.

26 పద్యమున–బంధురుడయ్యె జగద్ధితంబుగన్–అని సమా పక క్రియ గలదు అందుచే మూడింటికి సమన్వయము గలదు.

పై మూడింటిలో–"కొనియాడి వేడుకన్" (24) అను అస మాపకక్రియ–మధ్య–(25) నిర్వహింపఁగన్ అను పద్య మక్కర లేకయే–బంధురుడయ్యె– (26) అను సమాపకక్రియలో అన్వయ మగుచున్నది. "నన్నయ, సభలను కొనియాడి భారత రచనా బంధురుడయ్యెను."

## iii

కొన్ని ప్రతులలో పై పద్యములేదని తెల్పితిని. తరువాత– పై పద్యము లభ్యమైన వెనుక లేఖకులు ఈ పద్యము నెక్కడ చేర్ప వలెనో తెలియక-సమాపకక్రియలో పూర్తియగుచున్న "సారమతిం గవీంద్రులు" అన్న పద్యము తరువాత వ్రాసినారు. అయ్యెన్–అనునది సమాపకక్రియయైన వెనుక–'నిర్వహింపగనే'–అని అసమాపకక్రియ ఎట్లు సమన్వయము కాగలదు? అందువలననే–సంశోధిత ముద్రణ మున తాళపత్రప్రతులలో నీ పద్యము సమన్వయము కాలేదని వ్రాయ బడియున్నది.

## iv

పై వివరణబటి -24,26 పద్యములమధ్య పద్యములేకున్నను సమన్వయమగు చున్నది కావుననే చాలా ప్రాత ప్రతులలో అది లేదు – లేని తరువాత కొన్ని వ్రాత ప్రతులలోనున్నదే – అది యెప్పట నుండి వచ్చినది మనము కనుగొననలసియున్నది –

అసమాపక క్రియ – సమాపకక్రియతో రెండు పద్యము లున్నప్పుడు, మధ్యను, మఱియొక అసమాపక క్రియతో పద్యము రచించి కలిపిన అది సమన్వయమగును. ఈ యన్వయ రహస్యము నెఱిగిన కవి దీనిని రచించియుండవలెను–

## v

పై పద్యము – అప్పకవి – నిత్యసమాస విశ్రాంతుల కుదా హరణముగానిచ్చియున్నాడు – అతని కాలముకన్నాడ మనకు స్పష్టము– అది–1656. అంతకుముందు నన్నయ భారతమున మనకీ పద్య మున్నట్లు – లాక్షణిక నిదర్శనములు లేవు – అనగా లాక్షణిక లెవ్వ రును తెలుపలేదు – అందువలన – అప్పకవియే దీనిని రచియించి తన గ్రంథమునలక్ష్యముగా చేర్చెనని మనము నిర్ణయించుట కవకాశ మున్నది – అది యీ క్రింది వానిచే నిశ్చితమగుచున్నది –

సంశోధిత ముద్రణమున కుపయోగింపబడిన తాళపత్రప్రతు లలో – 'ఓ' అను ప్రతి అన్నింటికన్నా పూర్వముది దాని లేఖన కాలము – 14-7-1654. ఈ ప్రతిలో "పాయక పాకశాసనికీ" అన్న పద్యము లేదు – అప్పకవికాలము 1656 కావున–అప్పకవియే దీని రచయిత –

అప్పకవి పై పద్యమును నిత్య సమాస యతికి లక్ష్యముగా నిచ్చుచు – నన్నయయే రచించినట్లు తోపింపజేయుటకు మెలకువతో –"నిర్వహింపగన్" అను అసమాపక్రియలో రచించి చేర్చినాడు – దానితో అది నన్నయ భారతమున నతుకుకొనినది – అప్పకవి తరు వాతి లేఖకులు (క్రి. శ. 1656 కి తరువాతివారు) అది నన్నయ పద్యమేయని – నన్నయ పద్యము వెనుక–అన్విరముగా వ్రాసిరి –

## vi

### నారాయణభట్టు

ఈ పద్యమున నన్నయకు నారాయణభట్టు భారత రచనమున తోడ్పడినాడని–అతని సహాధ్యాయుడని చెప్పబడినది – కాని–సాహిత్య ప్రపంచమున – నన్నయకాలము (క్రీ. శ. 1050 మొదలుకొని, అప్పకవి కాలము క్రీ. శ. 1656) వఱకు – ఏ కవియు – "నన్నయతో నారాయణభట్టును" పేర్కొనలేదు– అప్పకవి

పఱకు నారాయణభట్టు – ప్రశంసచే కనుపట దు. పోనిండు. అప్పకవి తరువాత నైన కవులెవ్వరును నారాయణభట్టు ప్రశంస చేయలేదు కావున నిదియు నీ పద్యమప్పకవి రచితమని ఋజువుచేయు చున్నది.

నన్నయ నారాయణ భట్టుల సంబంధము వ్యక్తముచేయుట కప్పకవి మఱియొక పట్టున–నారాయణభట్టును పేర్కొన్నాడు.

భారతమునకేగాక, నన్నయ ఆంధ్రశబ్దచింతామణి రచన యందు - ఆతనికి తోడ్పడినట్లుగా అవతారికయందిట్లు వ్రాసి యున్నాడు.

మును నారాయణ ధీరుఁడు
తనకు సహాయుఁడుగ సంస్కృతము వాగను శా
సనుఁడు రచియించె దానిం
దెనిఁగింపఁగ నీకుఁదోడునే నిపుడగుదున్.

అప్ప. పీఠి 53

అప్పకవి ఈపద్యము – భాగవద్వాక్యముగా, స్వప్న వృత్తాంతములో చెప్పినాడు – పై నన్నయనారాయణ భట్టుల సాహచర్యము భగ వంతునిచే నేలబల్కింపవలయునో పాఠకులూహింపవచ్చును.

అప్పకవి స్వప్న సందర్భమున భాగవద్వాక్యముగా రాజరాజ నరేంద్రుడు సారంగధరుడు–వీరికథ కొంతచెప్పినాడు – చింతామణి తనకు నెట్లు స్వప్నములో లభించినది తెలిపినాడు –

అహోబలపతి కవిశిరోభూషణావతారికలో అప్పకవి స్వప్న వృత్తాంతము సంస్కృతమున ననువదించినాడు.

| అప్పకవీయము | అహోబలపతి అవతారిక |
|---|---|
| 48, 49, 50, 51, 52 | 63 నుండి 69 |
| పద్యము | శ్లోకములు |

గాని అందు నారాయణభట్టు ప్రశంసగల అప్పకవి పద్యము అహోబలపతి అనువదింపలేదు – ఇదియు "పాయక పాకశాసనికి" అన్న పద్యమప్పకవి రచితమని ఋజువుచేయుచున్నది
నన్నయలో నారాయణ శబ్దమునకు వ్యంజనయతియే యున్నది.
రమణుల్ దుర్వారవాత్యా రయమున నరనారాయణుల్ దాఁకి రుర్విన్

ఆది. 2-22

స్వరయతి కొఱకు అప్పకవి పైపద్యము కల్పించినాడని నిర్ణయము.

## 5. అగ్రాహ్యవళులు

ఆది పర్వమునందు (5–135)

క. నా వచనమున నపద్యము
గావించును నీకు గొంతి కడు నెయ్యమున్
నీ పగచిన యా యర్థము–
నూనె మనంబునను దలంతు సుందరి యెపుడన్ 204.

పై పద్యమున "నెయ్యమున్" అనుచో గణభంగము మునన్" అని యుండవలెను యెపుడనేకాదు యెపుడున్

వి. ఇందు 4 సా పాఠాంతరము

చూనె మనఃబునఁ దఁలంచు + చుందుదు నెపుడున్

తలంచుచు + ఉండు. తలంచుచుండు–ఇది నిత్య సమాస శబ్దముగాదు స్వరప్రధానపడి గూర్చదగి యుండగా సంధ్యక్షరమునకు వ్యంజన యతి ప్రాప్తి గావింపబడినది. అప్పకవి పాఠమునఁ గేవల వ్యంజన యతిప్రాప్తి.

భావ ప్రకాశిక (పుట–147)
సంశోధిత ము ద్రణము–(పుట 238)

### పాఠ భేదములు

1. దలంతుఁ డొలయక–వా. శ నూని
2. గంతు సొలవల్–ఎ, ఐ, ఒ, క, గి, చ, జశ, శరశి
3. దలంతు సొలయక-వీ-
4. దలంచుచుండుదు నేసున్.
   అ, ఆ, ఇ. ఈ, ఉ, ఊ, ఏ, ఖ, ఘ, ట, డ. తీ, ద, స. మ. యరల ఆనం. గణ. రఘు...ఈ పాఠము నందు అఖండయతి.
5. దలంతు సుందరి యెపుడున్–అక.

పై తాళపత్ర ప్రతుల పాఠములను పరిశీలించిన ఇరవై యొక్క (21) ప్రతులలో.

దలంచుచుండుదు నేనున్ అను పాఠమే యున్నది. ఈ 21 ప్రతులలోను చివరి పాఠములు మూడు లక్షణగ్రంథ కర్తలవి. వానిని కాలక్రమమున నిచ్చుచున్నాను.

రఘు: వార్తాకవి రఘునాధయ్యగారి లక్షణదీపిక–అప్పకవి దీని నుదాహరించినాడు. (క్రీ. శ. 1600)

గణ : గణపవరపు వేంకటకవి–ఆంధ్రప్రయోగరత్నాకరము ఇతడు అప్పకవి సమకాలికుడు. (క్రీ. శ. 1650)

ఆనం: కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ ఛందస్సు (క్రీ. శ. 1740)

ఇక తక్కిన 14 ప్రతులలో నేను (ఇందు ముద్రితములు నిఘంటువులు చేరియున్నవి )

"సుందరి" అను పాఠములేదు పై సంజ్ఞలలో లక అనగా అప్పకవి.

అప్పకవి ఒక్కడే 25 ప్రతులలోలేని క్రొత్త పాఠమును సృష్టించినాడు.

అప్పకవీయము వ్యాప్తిలోనికి వచ్చిన వెనుక లేఖకులు ఇందు వ్యంజనయతి యుండవలెనను అప్పకవి యభిప్రాయము ననుసరించి

దానిని 'సాలయుక' అని మార్చినారు. ఈ పాఠముగల ప్రతులు అప్పకవి తరువాతివి

అవి నన్నయ పాఠము

"నూనె మనంబునను తలంచుచుండుదు నేనున్"

ఈ యతి సందర్భమున చెప్పవలసిన దింకొకటి గలదు వర్తమానార్థక సంధి.

'చూచుచు ఉందు' అనునది వర్తమానార్థకము దీనికి ఉభయ వళులు స్వరవ్యంజనయతులు రెండు గలవు—నన్నయ, వర్తమానార్థక చువర్ణమున ఉభయ యతులు పాటించినాడు.

స్వరయతి

వగచు' చున్నవారు వారికి పంతయుడుగు మనిన ఆర్. 2-144

ఆచరించు చున్నదనిన నవిరళోద్గత బాష్ప......2-193

ఉరమున నిలిపిలు చుండుగాలత...... 3 103

ఉద్యన్న యానములు వెలయుచున్నను... 3-177

ఉగ్రతపము సేయుచున్నవాడ...... 3.254

ఇంకను గలవు.

వ్యంజనయతి—

నూనె మనంబునను గలంచుచుండుదు ఆది 5-135

చూచుచుండు మనవుడు తరిచోద్యమంది ఆర్. 4 70

నన్నయయే వర్తమానార్థక చువర్ణమునకు సంధి నిత్యమైనను కన్ని యలతోడ నాడుచునున్న దాని (ఆది 1-147) అని సంధి రహిత ముగను "అలుచుచుండ బ్రమస్వర అవని బ్రెల్లి (ఆది-147)" అని సంధి సహితముగను బ్రయోగించియున్నాడు. నన్నయ భావికవుల కుపదేశ పూర్వకముగా, పై ప్రయోగములను చేసియున్నాడు. అనగా కవులు సంధి నిత్యమైనను వికల్పముగా వాడవచ్చునని తాత్పర్యము.

## వర్తమానార్థక చువర్ణసంధి

తలచుచుండు దు అను క్రియలో 'తలచు'లోని 'చు' ధాత్వవయవము. అనగా ధాతువుతో కూడినది. రెండవ చువర్ణము, వర్తమానార్థమందు వచ్చినది. రెండవ 'చు' విధి వర్ణకము ఇచట విధివర్ణకమున స్వర వ్యంజన యతులు రెండును గలవు కాబట్టి సంధివచ్చినపుడు స్వరమునకు యతి సంధిలేనప్పుడు వ్యంజనమునకు యతి యుండును. దీనికి పై నుదాహరించిన నన్నయ ప్రయోగములే లక్ష్యములు

స్వరము ఉగ్రతపము సేయుచున్నవాడు.

వ్యంజనము చూచుచుండు మానవుడు మాతవిచోద్యమంది

అప్పకవి యీ నన్నయ యతి సంప్రదాయ రహస్యమును కని పెట లేక—కేవలము సంధిగతమైన తలంచుచుండు అని దానిని తలచు + చు + ఉండు అని విడదీసి 'చు' ఉత్వదిశిష్టమైన స్వరమైనది గావున 'నూనె' లోని 'నూ' ఉత్వవిశిష్టతలేని వ్యంజనము కావున దీనిని అఖండ యతిగా భావించి అప్పకవి 'సుందరి' అను పాఠము కల్పించినాడు.

### వర్తమానార్థక చువర్ణ సంధి

నా వ్యాఖ్యానమున దీనిని గూర్చి విశేషముగా చర్చించినాను—వర్తమానార్థకము—

1) వర్తమానార్థకము : కేతనాది కవులు రచించిన తెలుగు వ్యాకరణములలో లేదు.

2) దీనిని తొలుత వాడినవాడు గణపవరపు వేంకటకవి ఆంధ్రకౌముది (క్రీ. శ. 1650)

3) ఆంధ్రశబ్ద చింతామణి : సూత్రము (సంధి 7. సూ) చోర్వాప్యాద్వర్తమాన విహితస్య అనుదానిని అప్పకవి విడదీసి—

వర్తమాన క్రియాసంధి (5-69)

వర్తమానార్థ ప్రదుత్వపక్ప్రతులు (5-76)

అని తన మతమున కనుకూలమగునట్లు వ్యాఖ్యానించుట.

4) అహోబలపతి దీనిని ప్రాప్త విభాష అప్రాప్త విభాష అని సమర్థించుట.

మొదలగు వానిని గూర్చి పప్రామాణికముగా చర్చించి యున్నాను —

# ప్రాణి యతులు

# కవర్గాక్షర భేదములు

అప్పకవి కవర్గాక్షర భేదములు దెలుపుచు.

"ప్రథమ పరళంబులకు వకారములు నచ్చు" అని లక్షణము చెప్పి లక్ష్యముగానీ క్రింది భారత పద్యము నిచ్చినాడు.

"వినుము నరేంద్ర విప్రుండలిలెనే — జమదగ్ని సుతుండు శాపమిచ్చెనమర భర్తవంచనముచేసె ... ... ... ...

ఇది శాంతి పర్వమున 1-35 వ పద్యము — 2-114.

పై పద్యమున 'లలివెన్' అనునది 'అలిగెన్' అను క్రియలో— గకారమునకు వకారమువచ్చి—అలివెన్—అని యైనది. అది యతి స్థానములో నున్నది.

అప్పకవి — "వినుమునరేంద్ర! విప్రుడలివెన్" అను పాఠ మిచ్చియున్నాడు — కాని పంశోధిత—ముద్రణమున దీనికిట్లు పాఠాంతరమున్నది —

"కినుక నరేంద విప్రుడలిగెన్" — అ. రి.

(శాంతిపర్వము పుట–9)

అనగా తాళపత్ర ప్రతులలో "అలివెన్" అన్న పాఠము లేదని తెలియ వలెను– ఉన్నయెడల సంశోధిత ముద్రణము చూపియే యుండును.

పై తాళపత్ర ప్రతులు – చాలా ప్రామాణికములె వవి ఆ. ఆంధ్ర సాహిత్యపరిషత్తువారి ప్రతిలి. అనగా, ప్రౌఢదార వారు సేకరించిన పాటములుగల పతి –

దీనినిబట్టి వ్రాత ప్రతులలో–అలివెన్–అను రూపములేదు– అప్పకవి భారతములో తిక్కన యిట్టి ప్రయోగముచేసినని చూపు టకు "అలిగెన్" పాటము మార్చి – అలివెన్ – అని యతిస్థానమున నిలిపి – దాని కొఱకు – మొదటి అక్షరము 'కినుక' ను 'వినుము' అని మార్చినాడు. ఇది అప్పకవి స్వయముగా చేసినది.

మూలము పరిశీలించిన –

ఇట్టి పాఠముండుటకు అవకాశములేదు.

ఈ పద్యము శాంతి పర్వమున నారదుడు ధర్మరాజునకు – కర్ణుని చరిత్రను చెప్పు ఘట్టములోనిది. కర్ణుని జననముచెప్పి – ఇతడు అస్త్రవిద్యనభ్యసించుచు నొక బాణము ప్రయోగింపగా అది ఒక బ్రాహ్మణుని హోమధేనువు వత్సమునకు దూలి అది చనిపోయినది. అందు కాద్విజునకు కోపమువచ్చి, యుద్ధరంగమున నీరథము నేలలో క్రుంగిపోవుగాక అని శాపమిచ్చెను.

చూడుడు మూలము –

"అస్త్ర పరిశ్రమంబు సేయుచుండెనట్టి యెడనాశ్రమ పరి సరంబునం దొక్కచో దనయంతన లాఘవాభ్యాసంబు సేయుచుండ నొక్క మహాద్విజుని హోమధేనువు వత్సంబడ్డంబు వాతి బాణ గోచరంబై మృతిం బొందినగని

"యవ్విప్రుండు కోపంబున శాపం బిచ్చిన"

దానందేరు ధరణిం గ్రుంగె. (1–20)

దీని తరువాత నారదుడు, జమదగ్ని సుతుడైన పరశురామునివలన గలిగిన శాపమునుగూర్చి–ధర్మరాజుతో చెప్పెను. పైవానిని సంగ్ర హించుచు చెప్పినది పై పద్యము అందువలన–ఆపద్య ప్రారంభమున

"కినుక నరేంద! విప్రుడలిగెన్ –" అనియే యుండ వలెను; పై వచనమున – 'విప్రుడు' 'కోపము' రెండు పదములు గలవు – అందు కోపమునకు బదులు తరువాతలవేద్యమున 'కినుక' అని తిక్కన వ్రాసినాడు–అప్పకవి ప్రాసమార్చకుండ యతి సరిపోవు టకు 'వినుము' – అని ప్రారంభించినాడు దానివలన కథాక్రమ సందర్భమున కది విరుద్ధమైనదని పైన చూపితిని

అప్పకవి యిచ్చిన తప్పు పాఠమెంతవఱకు పనిచేసెనో గమ నింపదగినది.

నిఘంటు కారులు 'అలివెన్' గహించినారు శబ్దరత్నాకరమున

"అలువు అలుగు–కోపించు అని

పై శాంతి పర్వపద్యమీయబడినది–శద. పుట 42

సూ. ని (సూర్యరాయాంధ్ర నిఘంటువున –

అలువు–అలుగు–అని పై అప్పకవి పాటముదాహరింపబడినది– సూ ని. 1 సం. 332 పుట)

ఇంకొక విశేషము –

అలుగునకు అలువు–అలివెన్–అని యతి నిర్ధారకముగా నింత వఱకును ప్రయోగములే లభింపలేదు –

అందుచేత– 'అలివెన్' పాటము అప్పకవి కల్పితము

నా శబ్దరత్నాకర సంస్కరణమున దీనిని తెలిపినాను.

విశేష వశంయి

గీ. ప్రౌఢులు కొందఱు జ్ఞకారంబునకును
ప్రథమవర్ణంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వశులనుచు సోమయాజులు వడుగ తన 56
శాంతిపర్వమునందు (4–255)

క. జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశవిధిః బ్రకాశము సేయుం
గా నది సాల ధరిత్రీ
దానంబునకంటె నధికతరఫలదమగున్.

భా. ప్ర. (పుట 46)లో పై యతిని గూర్చి యిట్లు గలదు:

"భారతములో నన్నయ వాడలేదీ విశేషయతి. ఎఱ్ఱనయు ప్రయోగింపలేదు. తిక్కనయు నీయొక్కచోటనే ప్రయోగించెను. ఇటీవలి పండితులిట్టు తిక్కన ప్రయోగించి యుండడని దీనికి పాఠాంతరము పఠింతురు."

ఆ జ్ఞానికి నుపదేశవిధి ప్రజానితము సేయంగా "అనుకృతక పాఠము ప్రపంచితమయ్యె"

ఆ జ్ఞానికి నుపదేశవిధి ప్రజానితము సేయంగా
అను పాఠము పండిత కల్పితముకాదు కృతకమంటెకాదు–అది వందల కొలది యేండ్లనాగా తాళపత్ర ప్రతులలోనున్న పాఠము :

సంశోధిత మహాభారతము శాంతిపర్వమున "అజ్ఞానికి నుపదేశవిధిః బజానితము సేయంగా" అను పాఠమే మూలమున ప్రదర్శింపబడినది.

ప్రజానితముసేయన్ అని మూల పాఠమును గూర్చి సంపాదకులిట్లు వ్రాసినారు:

"ప్రకాశముసేయం" అ. క. 3-57 అప్పకవి దీనిని విశేష వళికి నుదాహరణముగా నిచ్చియున్నాడు. మేము చూచిన ప్రతులలో అప్పకవి పాఠము కానరాలేదు. 6 సం. (పుట 342)

పై. అ. క. ప్రతులు రెండును ముద్రిత ప్రతులు. అందువలననే సంపాదకులు "తాళపత్ర ప్రతులలో గానరాలేదు" అని వ్రాసి, అప్పకవి పాఠము నవలబెటి తాళపత్రప్రతి పాఠము చూపినారు.

ఈ విషయము తిక్కన పాఠమును అప్పకవి తిక్కన జ్ఞ-క యతిని వాడెనని నిరూపించుటకు మార్చెనని స్పష్టమగుచున్నది.

భా. ప్ర. ఆ పుటలోనే. జ్ఞ–క యతి ప్రయోగములు పేర్కొనబడినవి.

కర్మమధర్మ మజ్ఞాన మాగతము. పండి. పురా. పు. 264.
జ్ఞానేంద్రియ జ్ఞానకళ వేరు సేరుగా కాశ 1–139
అ. జ్ఞానంబునఁ గడవ వి గులఁ గల్మషమొందున్ రుక్మాంగ– 2–63

వ్యాఖ్యాతలు తాము స్వంతముగ వీనిని పరిశోధించినట్లు ప్రకటించినారు. కాని ఇవి ఇంతకుముందే లోకమునకు వెల్లడియైనవి. (చూ. అప్పకవీయము పీఠిక వావిళ్ల ముద్రణము 1951)

జ్ఞానేంద్రియ జ్ఞానకళ కాశీ. దీనిని వ్యాఖ్యాతలు చేర్చినారు. కాని కాశీఖండమున పాఠమదికాదు.

"ఘ్రాణేంద్రియ జ్ఞానకళ వేరుసేరుగా" అని పాఠము.

"ఘ్రాణేంద్రియజ్ఞానకళ వేరుసేరుగా" అన్న పాదముగల సీసపద్యము–సంస్కృతమున మయూర మహాకవి రచిత సూర్య శతకములోని యీ క్రింది శ్లోకమున కనువాదము:

"శీర్ణఘ్రాణాంఘ్రిపాణీన్ వ్రణిభిరపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్
దీర్ఘాఘ్రాతానఘౌఘైః పునరపి ఘటయత్యేక ఉల్లాఘయన్ యః
ఘర్మాంశోస్తస్య వోఽన్తర్ద్విగుణఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తేః
దత్తార్ఘాః సిద్ధసంఘైర్విదధతు ఘృణయః శీఘ్రమంహోవిఘాతమ్" 31 శ్లో

సీ. నేత్రంబులు న్మేషనిస్పృహత్వంబునొంద
శ్రుతి పుటంబుల శక్తి చొక్కుమడఁగ
ఘ్రాణేంద్రియజ్ఞాన కళ వేరుసేరుగా
జిహ్వ వివేకంబు చిఱుపఁబోప–

ఈరెండు పాదములు పై సూర్య శతకశ్లోకము ప్రథమ పాదమునకు వివరణానువాదము. అందుచేత 'జ్ఞానేంద్రియ' రానునని అపపాఠము–ఘ్రాణేంద్రియ సరియైన పాఠము. అప్పుడది సరసయతి – విశేష యతి కాదు.

జ్ఞ క యతులు–పాల్కురికి సోమనాథుని కాలమునుండి- 19వ శతాబ్దివఱకు – గానవచ్చుచున్నవి. శిష్ట సర్వశాస్త్రీ కృత జ్ఞాన ప్రసూనాంబికాశతకమున 27 స్థలములలో–జ్ఞ–క–యతులున్నవి. ఇవి నా అప్పకవీయ వ్యాఖ్యానమున నీయబడినవి.

అప్పకవి భారతపాఠమును మార్చెనని నిర్ణయము –

## అ థో జ్ఞా పి క లు

1) నన్నయ యతిప్రాసలు. అక్షరార్చన. డా. పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సంచిక.

2) అప్పకవి తన గ్రంథమునకు "ఆంధ్రశబ్ద చింతామణి" అనియే పేరుపెట్టినాడు. ఆశ్వాసాంత గద్యలో "ఆంధ్ర శబ్ద చింతామణి" అనియే యున్నది గాని అప్పకవీయము అను మాటలేదు. అప్పకవీయము, వ్యవహారనామము. ఆంధ్రశబ్ద చింతామణి గ్రంథస్థనామము.

3) యతిప్రాసతత్త్వము.
**Annals of Oriental Research Madras University Vol XV 1958.**

4) భావప్రకాశిక అప్పకవీయ తృతీయాశ్వాసముపై వ్యాఖ్య వ్యాఖ్యాన కర్త. విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ.

# మదర్ కరేజి

## శ్రీ సోమసుందర్

బెర్‌టోల్ట్ బ్రెక్ట్ అనే ప్రఖ్యాత జర్మన్ జాతీయకవి, నాటక రచయిత ఇంప్రెషనిస్టు టెక్నిక్‌లో రచించిన నాటకమిది. దీనిని తెలుగులోకి డాక్టర్ వి. ఎస్. శర్మగారు జర్మన్ మూలంనుంచి అనువదించారు. సాహిత్య అకాడెమీ న్యూఢిల్లీవారు దీనిని ప్రచురించారు. డెమ్మీ ఆక్టోవ్ 140 పుటల గ్రంథం; ఖరీదు పది రూపాయలు! పుస్తకము ఖప తంపై రచయిత ఛాయాచిత్రాన్ని చక్కగా ముద్రించారు. గ్రంథముద్రణ 10 పాయింటు టైపులో సాగడంవల్ల చదవడంలో కంటికి బాధకరంగానే ఉంది. ప్రభుత్వ సహాయంతో నడిచే అకాడెమీవంటి సంస్థ ఇంత ప్రయోజనకర గ్రంథానికి పదిరూపాయలు ఖరీదు పెట్టడం సామాన్య పాఠకునకు దుస్సహభారమే!

## బ్రెస్ట్ : : బ్రెక్ట్ (? !)

మూలరచయిత ఆంధ్రదేశంలోని అభ్యుదయ మేధావులకు పరిచిత పూర్వుడే! జర్మన్‌భాషా పరిచయమున్న కొద్దిమంది మేధావులుగాని, ఆంగ్లభాష ద్వారంనుంచి అతని కవితా హృదయాన్ని దర్శించుకొన్న అప్మదాదులుగాని "BERTOLT BRECHT" అనే ఆంగ్ల వర్ణక్రమాన్ని తెలుగులో బెర్‌టోల్ట్ బ్రెక్ట్ అనే ఉచ్చరిస్తున్నాం. యూరోపియన్ భాషలన్నింటితోనూ ఇంచుమించు గాఢపరిచయమున్న వారిలో కొందరింకా మనమధ్య ఉండటం అదృష్టమే! అట్టివారిలో ఆచార్య శ్రీ రోణంకి అప్పలస్వామిగారు కాని, జర్మన్ సంస్కృత ఆంగ్లాంధ్రాలలో సమగ్రవేత్త లనదగిన శ్రీ ఆర్. ఎమ్. చల్లాగారుగాని, జర్మనీ హేంబర్గులో రసాయనశాస్త్రంలో డాక్టరేట్ తీసుకొన్న మిత్రులు శ్రీ ఎస్. వి. ఎస్. రావు (మైసూరు) గారుగాని ఈ బ్రెక్ట్‌ను బ్రెస్ట్ అని ఉచ్చరించడం ఈ రచయిత ఎన్నడూ విని ఉండలేదు. పై వారెవ్వరికీ డా. వి. ఎస్. శర్మగారికి మల్లే బ్రెక్ట్‌ను బ్రెస్ట్ అనాలని తెలియదో, లేక బ్రెక్ట్ అనే ఉచ్చారణ ఆంగ్లశబ్దంగా అశ్లీలంగా వినిపించడం కారణమో అంతుపట్టదు. ఇటీవలనే నేను శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారిని కలుసుకున్నపుడు ప్రసంగవశాత్తు వారి బ్రెక్ట్ సంగతులు కొన్ని చెప్పారు. అప్పుడు కూడా వారు బ్రెక్ట్ అనే ఉచ్చరించారు. జర్మన్, ఫ్రెంచి, రష్యన్ వగైరా భాషలకు చెందిన రచయితల పేర్ల ఉచ్చారణలో ఈ దేశంలో ఒక క్రమ పద్ధతి అనుసరించబడటంలేదు. మేధావులలోనే ఒక ఏకాభిప్రాయంలేదు. దానితో పాఠకులలో మరింత గందరగోళం ఏర్పడుతోంది. ఈ ఉచ్చారణా పద్ధతిని సువ్యవస్థితం చేసేందుకు బహుభాషావేత్తలైన నిపుణుల సంఘాన్నొకటి ఏర్పరచి వివిధ సాహితీమూర్తుల నామోచ్చారణ విషయంలో సుస్పష్టరూపాలను ప్రతిపాదిస్తే బాగుండు. ఇలాంటి పనులు ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ పూనుకోవాలి.

ఇప్పుడు సమీక్షించబోతున్న ఈ ప్రఖ్యాత నాటకం మదర్ కరేజ్‌ని శ్రీ శర్మ హలంతంగా కాక ఇకారాంతంగా ఆంధ్రీకరించారు. అలాగే బెర్‌టోల్ట్ బ్రెక్ట్‌ను-బెర్‌టోల్డ్ బ్రెస్ట్‌గా వ్రాశారు శ్రీ శర్మ జర్మను భాషలో డాక్టరేట్ తీసుకున్న విద్యావేత్తలు. వారి ఉచ్చారణను తప్పుపట్టడానికి నాకు శక్తి చాలదు. ఐనా ఈ సమీక్షలో నా నోటికి అలవాటయిన ఉచ్చారణారీతిలోనే 'బ్రెక్ట్' అనే పేర్కొందలచాను ఈ సమీక్షకుడు బ్రెక్ట్ రచించిన నాటకాలను ఆంగ్లానువాదాలలోనైనా చదివి ఉండలేదు బ్రెక్ట్ గొప్ప నాటకాలు రచించాడనీ, స్వయంగా ప్రయోక్తగా ప్రఖ్యాతి నార్జించాడనీ చదువుకొన్నాడు.

## కవిగా బ్రెక్ట్ :

బ్రెక్ట్ సెలెక్టెడ్ పోయమ్స్ హెచ్. ఆర్. హేస్ అనే ఆంగ్ల రచయిత అనువదించి, విపుల పీఠికతో ప్రచురించిన గ్రంథం హైదరాబాద్‌లోని మాక్స్ ముల్లర్ భవనంనుంచి ఎరువు తీసుకుని చదివాను. ఆ గ్రంథాన్ని న్యూయార్క్‌లోని గ్రోవ్ ప్రెస్‌వారు ముద్రించి ప్రచురించారు. హేస్ తన పీఠికలో బ్రెక్ట్ మహాకవి అనీ మహానాటక రచయిత అనీ ధ్రువపరుస్తూ వివరించాడు. బ్రెక్ట్ తన రచనలద్వారా- HEDONESTIC IRRESPONSIBILITY ని, PURITANICAL DIDACTICISM నీ తన రచనా సంవిధానానికి దరిచేరకుండా తిరస్కరించాడని చక్కగా వివరించాడు; ఈ ఆంగ్లానువాదకుడు బ్రెక్ట్ వచించిన సూక్తులలో కొన్నిటిని ఉల్లేఖించి భాష్యం రాశాడు. ఆ ప్రవేశికనుంచి కొన్ని సూక్తులను, కొన్ని కవితల పంక్తులను నేను 1972లో డైరీలో వ్రాసుకున్నాను. వాటినుంచి యిక్కడ ఒకే ఒక్క సూక్తిని ఉల్లేఖించి, పాఠ

కులను చిత గించమని కోరుతున్నాను అది ఈ నాటకావగాహన కెంతో తోడ్పడగలదు "You die like any beast, there is nothing after death is a familiar sentiment, which generally leads to hedonestic irresponsibility......" అన్నది బ్రెక్ట్ ఆలోచనా ధోరణికి నికషం కాగలదు. ప్రతి జీవికి మల్లేనే ప్రతి మనిషీ మరణిస్తాడు. మరణానంతరం ఏమీ లేదన్న ప్రఖ్యాతభావం, జీవితకాలంలో మనిషిని శుష్క సుఖవాదిగా కర్తవ్యతా విముఖుడిగా మార్చకపోవడమే వాంఛనీయం అని అతని అభిప్రాయం.

ఇలాంటి ఉత మాశయాలుగల స్వతంత యోచనాపరుడూ, ప్రతిభావంతుడూ, ప్రగతిశీలి, శాంతికాముకుడూ, మానవతావాదీని బ్రెక్ట్. అతనెన్నో కవితలను రచించాడు దేశం నలుమూలలకీ పర్యటించి తన దేశీయ జానపదుల హృదయాలలో నిక్షిప్తమై ఉండే విరంజన గీతికల నెన్నిటినో సేకరించి, వాటిని అన్వయ క్లిష్టతలులేని రమణీయ భావగీతులుగా సంస్కరించి, ఆ ప్రజలకే తిరిగి వినిపించాడు. హాయిగా గొంతెత్తి పాడుతూ వేలాది ప్రజల సమావేశాలను ఉరూతలూగించేవాడట! అతని గీతాలు వింటూ ప్రజానీకం ఉల్లోల కల్లోలమైపోయేదట! ఇదికూడా అతనిపై హిట్లర్‌వంటి వాడికి కన్నెర్ర కలిగించడానికి కారణమైందని బ్రెక్ట్ జీవిత చరిత్ర సంగ్రహంగా రాస్తూ హేస్ అంటాడు.

## జర్మన్ సాహిత్యంలో పునరుజ్జీవనం:

జర్మన్ సాహిత్యానికి గథే (1749-1832 JOHANN WOLF GANGVON GOETHE) ప్రవేశంతో ఒక పునరుజ్జీవన కాంతిరేఖ ఏర్పడింది. ఎందరో మహాకవులు పుట్టారు. ప్రపంచ మేధాసంపదకు ఉదార రత్నరాసులందించిన బుద్ధిజీవులెందరో ఉద్భవించారు. వైజ్ఞానికశాస్త్రంలో నూత్నవిజయాలు సాధించిన మహాపురుషులెందరో అవతరించారు. ప్రపంచగమనాన్నే సంపూర్ణంగా మార్చివేసిన తత్వవేత్తలకు కన్నతల్లిగా జర్మనీ చరితార్థమైంది. హెగెల్, ఒడ్విగ్‌ఫ్యూర్‌బాఖ; డుహెరింగ్; కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగెల్స్ అందరూ జర్మనీ దేశస్థులే! సిగ్మండ్ ఫ్రాయిడ్ ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్‌వంటి శాస్త్రవేత్తలు జర్మనీ కడుపు పండించి, ప్రపంచ వైజ్ఞానికశాస్త్రంలో అపూర్వమైన ప్రకరణాలను ఆవిష్కరించారు. ఆధునిక కవులలో ఎర్నెస్ట్ టోలర్, బెర్‌టోల్డ్ బ్రెక్ట్; అతని సహాధ్యాయుడు ప్రఖ్యాతకవీ హోస్ బీవెన్; జొహేన్స్ బొరోలోస్కీవంటి వారెందరో చిరంతన కీర్తిమంతులు జర్మన్ దేశంలో ప్రభవించడం ఆ దేశానికెంతో కీర్తిని ప్రసాదించింది.

దురదృష్టమేమంటే ఆ జర్మనీ దేశమే శతాబ్దాలుగా యుద్ధోన్మాదుల కాటపట్టయి పోయింది. మానవజాతి మహేతిహాసమంతా కనీవినీ ఎరుగనంత మానవ వినాశనం ఒక్క జర్మనీ దేశంలోనే శతాబ్దాలుగా జరుగుతూ వచ్చింది. అపార నష్టాలకు గురై ఛిద్రమైపోతూ వచ్చింది.

ప్రస్తుతం పరిశీలింపబడుతున్న నాటకం 'మదర్ కరేజ్' బ్రెక్ట్‌కు శాశ్వతకీర్తిని ప్రతిష్ఠించిన కళాఖండాలలో ఒకటి. ఇలాంటి ప్రతిభావంతులైన కవుల నెందరినో-జర్మనీ దేశాన్ని శాశ్వతంగా అపకీర్తిపాల్జేసిన నరరూప రాక్షసుడు అడాల్ఫ్ హిట్లర్, కుటిల ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకున్న 1932నుంచీ తన పొట్టనపెట్టుకోవారంభించాడు కవులకు మేధావులకూ మరణదండనో, దేశ బహిష్కారణో ప్రసాదింపబడ్డాయి. తన ముఖ్యసిద్ధాంతమైన- 'బ్రహ్మాండమంత మానవజాతి బ్రహ్మాండమంత అసత్యానికి లొంగి తీరుతుంది' ['The great masses of the people will more easily fall Victims to a great lie than to a small one – Adolf Hitler] అనే దానికి మేధావుల ఆలోచనలు. కవుల వాక్కులు ప్రతిఘాతకృత్యాలై ప్రతిఘటిస్తాయనివాడు ముందే భయపడ్డాడు. కనుకనే ఆలోచనాపరులూ, మేధావులు, శాస్త్రవేత్తలు, కవులు రచయితలు వాడి అధికారదాహానికి తొలి బలిపశువులు కావలసి వచ్చింది. తర్వాతనే వాడు దారుణంగా హత్యచేసింది నత్యాన్ని! ముఖ్యంగా కవులూ రచయితలూ ప్రజల అంతరాత్మను తీర్చిదిద్దగల పాలకులని వాడు తన పరిపాలనకు, ప్రపంచ విజేతననిపించుకోవాలన్న యుద్ధోన్మాదానికీ ప్రజలను వ్యతిరేకులుగా తీర్చిదిద్దగలరని ఈ ఫాసిస్టు నియంత ముందే గ్రహించాడు

ఆ వరుసలోనే బ్రెక్ట్‌కూడా దేశాంతర్గతుడై, అజ్ఞాత వాస క్లేశాలతో ప్రాణాల దక్కించుకోవలసి వచ్చింది. ఇన్ని కష్టాలలో సైతం అతను ఆశావాదాన్ని విడువలేదు. ఎప్పటికైనా హిట్లరాది నరపశువులు చచ్చి తీరతారనీ, జర్మనీకి మళ్ళీ మంచిరోజులు వస్తాయనీ ఆత్మవిశ్వాసంతో ప్రాణాలు కాపాడుకున్నాడు. అతని ఈ కార్యదీక్షే, ఈ ఆత్మవిశ్వాసమే, ఈ చిత్తస్థైర్యమే. ఈ ఆశావాదమే-అతను తీర్చిదిద్దిన మహత్తరపాత్ర మదర్‌కరేజ్ (వీరమాత)లో ప్రతిబింబించింది. అజ్ఞాతవాస దశలోనే యిలాంటి ఉత్తమ రచనలెన్నో చేశాడు బ్రెక్ట్...194...లో యుద్ధం ముగిసింది బెర్లిన్ పతనంతో! హిట్లర్ విరగడయ్యాడు. బ్రెక్ట్ మళ్ళీ 1948లో తన మాతృదేశానికి వచ్చి, ఒక థియేటర్ స్థాపించాడు. తన ప్రయోగాత్మక నాటకాలను ప్రదర్శించసాగాడంభించాడు. బ్రెక్ట్ నాటకాలు అటు జర్మన్ నాటక రంగానికి ఇటు ప్రపంచ సాహిత్యానికి నూతనాలంకారాలుగా శోభించాయి.

# మదర్ కరేజ్: చారిత్రకతాత్త్వికభూమిక:

పుట్టుకతో మానవుడు దైవాంశ సంభూతుడే! కాని పరిస్థితుల దుష్ప్రభావంవల్ల ఎంత నీచంగా బ్రతకవలసివస్తుందో దుర్భర సమర బీభత్సాలు నిరూపిస్తాయి. మనిషిలోని స్వార్థపశు లక్షణాలు విజృంభిస్తాయి. ఈ అంశాన్ని ఈ నాటకానికి ప్రధాన ఇతివృత్తంగా స్వీకరించి ఎంతో రసమయంగా చిత్రించాడు బెక్ట్. ఈ చిత్రణకు సావకాశంగా సముచిత వాతావరణాన్ని సృష్టించుకున్నాడు. సముచిత పాత్రలను సమకూర్చుకున్నాడు. కాలస్థల అవకాశానుసారం ప్రేక్షకుల కన్నులకు కట్టేటి రీతిగా ఉచిత ప్రతీకను సిద్ధంచేసుకున్నాడు.

17 వ శతాబ్దంలో మొదటి నాలుగు దశాబ్దాల కాలము తీవ్ర యుద్ధాలకు గురి అయింది. ఈ యుద్ధాలలో కేథలిక్, ప్రొటెస్టెంట్ క్రిస్టియన్ శక్తులు శత్రుపక్షాలయ్యాయి. దీనిని యూరోప్ చరిత్రకారులు ముప్ఫైయేళ్ళ మతయుద్ధమని పిలుస్తారు. ఇది బొహీమీయాలో ప్రారంభమై స్వీడన్, డెన్మార్కు, ఫ్రాన్సు వంటి దేశాలకు విస్తృతమయింది. కాని ఈ భయంకర యుద్ధానికి ప్రధానరంగభూమి జర్మనీ దేశమే. జర్మన్ ప్రజాజీవితమే ఈ యుద్ధాల మూలంగా సర్వనాశనమయింది. ఈ యుద్ధం నాలుగు దశలుగా సాగింది. 1618 నుంచి '33 వరకూ బొహీమీయాలో జరిగిన యుద్ధాన్ని పేలటైన్ దశ అంటారు. 1624 నుంచి '29 వరకూ డెన్మార్క్‌లో జరిగిన యుద్ధానికి డేనిష్‌దశ అని పేరు. 1630 నుంచి '35 వరకూ ఈ యుద్ధంలో స్వీడన్ ప్రధాన పాత్ర వహించింది. 1635 నుంచి 48 వరకూ జరిగిన అంతర్దశలో ఫ్రాన్సు యుద్ధరంగంలోకి దిగింది.

ఈ చారిత్రక భూమికలో మదర్ కరేజి అనే ఈనాటక ఇతివృత్తం మలచబడింది. పెద్దా చిన్నా దేశాలనే తారతమ్యం లేకుండా యూరోపు ఖండంలోని దేశాలన్నింటికీ ఈ యుద్ధ బీభత్సం వినాశకరంగా వ్యాపించింది. ఈ చారిత్రక దృష్టితో సామాజిక వాస్తవికతా దర్శనంతో యుద్ధ నేపథ్యంలో మానవ జీవితాన్ని చిత్రించదలిచాడు రచయిత. ఈ చారిత్రక అంశాలను పాత్రల సంభాషణల ద్వారానూ తెరవెనుకజరిగే కల్లోలాల శబ్దసంకేతాల ద్వారానూ అభివ్యక్తం చేశాడు. అంతేతప్ప ఆ చారిత్రక పాత్రలనే యథాతథంగా నాటకరంగంలో ప్రవేశపెట్టలేదు. బెక్ట్ ప్రమేయం ఛిద్రమవుతున్న మానవత్వంతో! వినాశనమవుతున్న సామాన్యజన జీవితంతో. కనక నాశనకారులు పాత్రలు ప్రత్యక్షంగా నాటకంలో ప్రవేశించవు. ఈ దర్శనను ఆవిష్కరించుకుందుకు బ్రెక్ట్ ఒక అపూర్వ సన్నిధానాన్ని ఎన్నుకున్నాడు. ఇందలి ప్రధాన పాత్ర మదర్ కరేజి ఆమె మానవత్వానికి మాతృత్వానికి ఒక సంకేతం మాత్రమే. యూరోపులోని అనిదేశాలతోనూ ఈమెకు ఏదోవిధంగా గాఢసంబంధముంటుంది. ఆ సంగ్రామ భయంకర దినాలలో ఆమె దేశంనుంచి దేశానికి ప్రజల నిత్యావసర వస్తువులు అమ్ముకునే అంగడిబండిని నడుపుకుంటూ అనవరతయాత్ర సాగిస్తూ ఉంటుంది. తాను వ్యక్తిగతంగా యుద్ధం ఒక నూరేళ్ళపాటయినా సాగితే తప్ప బతకలేనట్లు చెపుతూ ఉంటుంది. కాని పరోక్షంగా యుద్ధంవల్ల కలుగుతున్న నష్టాలకు ఖేదం పొందుతూ ఉంటుంది బీభత్సాలలో బతుకుతూనే ఆత్మస్థైర్యాన్ని కోల్పోకుండా యూదేశాల ప్రజ లనుభవిస్తున్న అపార బాధల గాథలను అభివ్యక్తం చేస్తూఉంటుంది.

## ఈ నాటకంలోని కథ

ఈ ముప్ఫై యేళ్ళ యుద్ధం మొదట ఉత్తర యిరోపా దేశాలకు తరువాత మధ్య ప్రాంతాలకు ఆదుపరి దక్షిణ దేశాలకు తన రంగభూమిని మార్చుకుంది. కాని జర్మనీ దేశానికి నాశనం ఎడతెగని దెబ్బలు తగలడం మానలేదు. తదనుకూలంగానే ఈనాటకంలోని రంగాలకూడా ఆయా ప్రాంతాలకు మారతాయి కథానాయిక అసలు పేరు అన్నా ఫియర్లింగ్. తూర్పుదేశాలలో జన్మించినదయినా నిర్భయంగా యుద్ధకాలంలో సంచారజీవిగా బతుకుతున్నందువల్ల ప్రజలీమెను మదర్‌కరేజ్ (వీరమాత) అనే సార్థకనామంతో పిలుస్తారు. యుద్ధభూములో చిల్లర వ్యాపారం చేసుకుందుకు స్త్రీల కనుమతీయబడింది. ఆ చారిత్రక సత్యాన్ని ఆధారం చేసుకుని రచయిత ఈ పాత్రను సృష్టించాడు ఈమెకు కాట్రిన్ అనే ఒక కుమార్తె ఉంటుంది. నీడలా ఈమెను విడిచిపెట్టదు. ఆమె పుట్టుకతోనే మూగది. కనక నాటకంలో ఆమె పాత్రకు నటనేకాని సంభాషణ అవసరం లేకుండా పోయింది. మదర్ కరేజికి ఐలిఫ్, స్విస్చీస్ అనే ఇరువురు కుమారులుంటారు వాళ్ళిద్దరూ ఆమె కన్నబిడ్డలు కాదు. కాని ఆ విషయం వాళ్ళకు తెలియదు. అనాధశిశువుల్ని తెచ్చి పెంచి పెద్దజేసుకుంది. వాళ్ళిద్దరు యుద్ధ పర్యవసానానికి బలయిపోతారు. ఈ నాటకంలో ప్రాధాన్యత వహించే పాత్ర మిలిటరీ ఫాదరీ జర్మనీ దేశపు మతగురువు. ఈ ఫాదరీ మదర్ కరేజికి ఆకర్షితుడై ఆమెతో కలిసి ఆమె చెప్పిన పనులన్నీ చేస్తూ బతుకుతాడు. బండిలాగుతాడు గిన్నెలు కడుగుతాడు. మధ్యమధ్య అవకాశవాదంతో రంగులు ఫిరాయించి మతోపన్యాసాలిస్తుంటాడు. మిలిటరీవాళ్ళ వంటవాడు మరో పాత్ర. వాడికీ ఈమెపట్ల ఆకర్షణకలుగుతుంది. అప్పుడపుడు వచ్చి చూసి పోతుంటాడు. ఎవెట్టి అనే వేశ్య పాత్ర ఒకటి. మిలటరీ సిబ్బందికి దైహికమైన ఇబ్బందులు తీరుస్తూ విలాసంగా బతుకుతుంది. రంగస్థలంమీదికి అప్పుడప్పుడు జాలుం నెయ్యడానికి మిలటరీ అధికారులు, బాధలకు లోనయ్యే రైతుకుటుంబాలు వస్తూపోతూ ఉంటాయి.

12 రంగాలుగా విభక్తమయిన ఈనాటకంలోని మొదటిరంగం 1624 స్వీడన్ దేశంలో జరుగుతుంది. రెండో రంగం 1624లో పోలెండు ప్రాంతంలో జరుగుతుంది. మూడవరంగం 1629లో స్వీడన్‌లో జరుగుతుంది. యుద్ధం ఆదర్శం క్రైస్తవమత సంరక్షణ మని రెండుపక్షాలు చెప్పుకుంటాయి. ఇన్నాళ్ళూ మదర్ కరేజి ప్రొటెస్టెంటుల ఆధిపత్యమున్న ప్రాంతాలలో తిరిగింది. ఇప్పుడు కేథలిక్ మత ప్రాబల్యమున్న ఫిన్లెండుకు చేరుకోగానే తన దుస్తులూ అలంకరణలూ మత చిహ్నాలూ అన్నీ కేథలిక్‌లకు సంబంధించినవి ధరిస్తుంది. నాలుగవరంగం 1630లో జరుగుతుంది. ఆమె వ్యాపారం బాగా దెబ్బతిని కేథలిక్ కల్నల్‌తో మొరపెట్టుకుందుకు మిలటరీ కేంపుకి రావడం ఈ రంగంలో ప్రదర్శితమవుతుంది. అయిదవ రంగం దక్షిణ జర్మనీకి చెందిన బవేరియాలో జరుగుతుంది. ఈ రంగంలోమాత్రం బండికి దగ్గరగా ఒక గుడారం వేయబడుతుంది. ఆరోరంగం కూడా బవేరియాలోనే, ఇన్గోల్‌స్టాట్ నగర సమీపంలో 1632లో జరుగుతుంది. ఏడవరంగం అప్రధానమయింది. బండి రంగస్థలంపైన ఫాదరీతో మదర్ కరేజి పరిస్థితులు చర్చిస్తుంది. ఎనిమిదవరంగం స్వీడన్ రాజు గుస్తావ్ అడోల్ఫ్ యుద్ధరంగంలో చనిపోయిన తరువాత 1632లోనే జరుగుతుంది. మదర్ కరేజి పెద్దకొడుకు ఐలిఫ్‌కూడ చనిపోతాడు. తొమ్మిదవరంగం 1634లో జరుగుతుంది. మధ్య జర్మనీలోకి స్వీడన్ సైన్యాలు ఉవ్వెత్తుగా విరుచుకుపడి దురాక్రమణ చేస్తాయి. మదర్ కరేజి వ్యాపారం బాగా దెబ్బతింది కూతురుతో సహా ఎక్కడికయినా పోదామా అని దిగులుపడుతుంది. మిలటరీ వంటవాడు వచ్చి కూతుర్ని వదిలి తనతో వచ్చెయ్యమని ఆమెను బలవంతం చేస్తాడు. ఆమెఅంగీకరించదు. పదవరంగం 1635లో జరుగుతుంది. అప్పటికే ఆమె చాలా నీరసపడిపోతుంది. ఎన్నో దేశాలు బండి లాక్కుంటూ తిరిగింది. మళ్ళీ మధ్యజర్మనీకి వచ్చింది. రాజమార్గంలో ఆగింది. పదకొండవరంగం 1636లో జర్మనీలోనే జరుగుతుంది. కేథలిక్ చక్రవర్తి దళాలు ప్రొటెస్టెంట్ నగరమయిన 'హాలే' దాడికి సంసిద్ధమవుతాయి. మదర్ కరేజి కుమార్తె కాట్రిన్ మూగదయినా నగర రక్షణకు సమయోచిత సాహసచర్యచేసి వీరమరణంపొందుతుంది. చివరి రంగం అదే స్థలంలో. తల్లి కూతురి శవందగ్గిర కూర్చుని భోరుభోరున ఏడుస్తూ ఉంటుంది. చుట్టూ మూగిన రైతులతో తన జీవితాన్ని సమీక్షించుకుంటుంది. చివరికి శవాన్ని రైతుల కప్పగించి ఉత్తరక్రియల నిమిత్తం సొమ్మిచ్చి ఒంటరిగా ప్రయాణం సాగిస్తుంది. బండి ఖాళీ అయిపోయింది. మిలటరీవాళ్ళ గొడ్డళ్ళ దెబ్బలకి ఛిద్రమయిపోయింది. అయినా అది ఆమె ఆశావాదానికి ప్రతీక. దాన్ని ఒక్కర్తే లాక్కుంటూ నిష్క్రమిస్తుంది. నాటకం పరిసమాప్తమవుతుంది.

ఈ విధంగా పన్నెండు సంవత్సరాల దీర్ఘకాలాన్ని పన్నెండు రంగాల్లో ప్రతిబింబిస్తుందీ నాటకం. యుద్ధంవల్ల ప్రజలు అటు కేథలిక్ మతానికి చెందినా ఇటు ప్రొటెస్టెంటు మతానికి చెందినా సర్వనాశనమయిపోయారు. బతికి బయటపడ్డవాళ్ళ జీవితం దయనీయంగా సాగుతోంది. వ్యవసాయక్షేత్రాలు ఊషర క్షేత్రాలుగా మారిపోయాయి. ఈ భీభత్సాలన్నీ సంభాషణలద్వారా వ్యక్తమవుతాయి. నేపథ్య శబ్దాలవల్ల వాతావరణం ద్యోతకమవుతుంది. అప్రధాన పాత్రల ప్రవేశ నిష్క్రమణలు కథాకథనానికి తోడ్పడతాయి. రెండుపక్షాల యుద్ధోన్మాదులకు మతగురువులు కింకరు లవుతారు. బాసిసలుగా అవకాశవాద సిద్ధాంతాలనే కరువు పెడతారు. మతం నీచమైన మహమ్మారిగా మారింది. రైతులు బలిపశువులయిపోయారు. కరువులూ కాటకాలూ అంటురోగాలు ప్రబలాయి. రైతులు తమ పసికందులనే కోసుకుతింటున్న దుర్వార్తలు వ్యాపించాయి. మదర్ కరేజి ఆత్మీయులు సర్వుల్నీ కోల్పోయింది. కష్టపడి సంపాదించుకున్న సకల సంపదల్నీ కోల్పోయింది. ఇంతటి దుస్సహ కష్టాలలో కూడా తన ఆశాభావాన్ని కోల్పోక పురోగమిస్తుంది. చిరస్థైర్యాన్ని విడువదు మంటలలోంచి మానవత్వాన్ని కాపాడుకునే జీవచైతన్యరేఖగా ఆమె ఈ నాటకంలో ఆద్యంతమూ వెలుగుతూ ఉంటుంది. ఆమె పాత్ర సర్వమానవ లక్షణాలకూ కాణాచి. ఆమెలో ఎన్నో బలహీనతలు. అడుగడుగునా ఎంతో గ్లాని. కాని మొక్కవోని ఆశ. బ్రెక్ట్ చిత్రణలో మదర్‌కరేజి పాత్ర ఉజ్వల మానవమూర్తిగానే తప్ప ఒక దేవతగా ఆదర్శీకరింపబడలేదు.

జర్మనీదేశ చరిత్రలో నరరూపరాక్షసులు అనేక పర్యాయాలు తలెత్తారు. యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టారు. జనజీవితాన్ని అతలాకుతలం చేశారు. దేశానికి అపకీర్తి తెచ్చారు. ఈ మహారచయితకు సమకాలికుడు హిట్లర్. అతను మళ్ళీ గత చరిత్రను పునరావృతం చేశాడు. కాని కాలగర్భంలో కలిసిపోయాడు. ఎంత వినాశనం చెందినా మానవశక్తి అజరామరంగా పురోగమిస్తుంది. ఆ దేశంలో తరతరాలుగా జన్మించిన మహాకవులు మాత్రం ఆ దేశకీర్తిని దిగంత పరివ్యాప్తంచేశారు వ్యక్తిగతంగా ఎన్ని కష్టనష్టాలకు గురయినా బ్రెక్ట్ సయితం ఆ జీవన స్రవంతినే ముందుకు తీసుకుపోయాడు. అనల్పకీర్తి నార్జించాడు. కనుకనే రాజతరంగిణి కారుడు కవుల ప్రభావం గురించి యిలా అంటాడు :

'కోన్యః కాలమతి క్రాంతం
నేతుం ప్రత్యక్షతాం క్షమః
కవిం ప్రజాపతీం స్త్యక్త్వా
రమ్య నిర్మాణశాలినః !'

ఈ బెర్టోల్ట్ బ్రెక్ట్‌వంటి ఆధునిక కవులు-ప్రజాహితంకరులై రమ్యార్థ గానాలుగై, కవి ప్రజాపతులై గలించిపోయిన కాలాన్ని మన కనులముందు సాక్షాత్కరింపచేయకపోతే- నరరూప రాక్షసుల అమానుష కృత్యాల దుస్సహస్మృతులు తప్ప మరేమీ మానవజాతికి వారసత్వంగా లభించి ఉండేవికాదు.

## తెలుగు జాతికొక కానుక

ఈ మదర్‌కరేజి అనే ఉత్తమ కళాఖండాన్ని ఆధునిక జర్మన్ సాహిత్య ప్రతినిధిగా ఎన్నుకొని అనువదించి తెలుగుజాతికొక అమూల్య బహూకృతిని సమర్పించిన శ్రీ శర్మగారు కృతకృత్యులు. కేంద్ర సాహిత్య అకాడెమీ దీనిని చక్కగా ప్రచురించి ప్రశంసాపాత్రమయింది. ఈ సంఘటన తెలుగుజాతికొక అదృష్టం.

భారతి సంపాదకులీ గ్రంథాన్ని సమీక్షించడానికి ఈ రచయితను ఎన్నికచేయడం వ్యక్తిగతంగా తన అదృష్టంగా భావిస్తూ కృతజ్ఞత తెలుపుతున్నాడు. అయితే ఈ అదృష్టం వెనుక ఒక విషమ పరీక్షకూడా లేకపోలేదు. ఈ అనువాదకర్త శ్రీ వి ఎస్. శర్మ నాకు సుమారు పాతికేళ్ళుగా మిత్రులు. మైత్రీబంధం సత్య సందర్శనానికి అవరోధం కాకూడదని చిత్తశుద్ధిగా వాంఛిస్తూ, అనువాద రచన గురించి కొంత ప్రస్తావించవలసి ఉంది.

## అనువాదంలో తెలుగు నుడికారం

శర్మగారికి జర్మన్ భాషావైదుష్య మున్నంత చిక్కగా తెలుగు భాషా పరిజ్ఞానం లేదన్న విషయాన్ని ఈ రచన వ్యక్తం చేస్తోంది. తెలుగు వాక్య నిర్మాణంపట్లగాని, మూలంలోని భావాలు భాషాంతరీకరణంలో ఓజస్సుందరంగా తీర్చబడాలన్న కౌశలంపట్లగాని వారు శ్రద్ధ చూపలేకపోయారు. వారీ అనువాదరచనలో ప్రదర్శించినంత ఉత్సుకత నిర్మాణ దక్షతలో ప్రదర్శించలేదు. అందువల్ల ఇలాంటి ఉత్తమ కళాఖండం తెలుగులో బైబిల్ అనువాదంలా నిర్జీవమయింది. ముక్కస్య ముక్కానువాద సరళి జర్నలిజానికి అక్కర వస్తుంది- ఉత్తమ గ్రంథాలకు కాదు. ఈ అంశాన్ని ధ్రువపరచడానికి గ్రంథంలోని ప్రతివాక్యమూ ఒక ప్రబల తార్కాణగా నిలుస్తుంది. స్థాలీపులాకంగా కొన్ని వాక్యాలు చూపుతాను :

1. ఈ ముక్కలే మీ భవిష్యత్తు చెప్పుతాయి; "అబ్బాయ్! అబ్బాయ్! యుద్ధంలో మీ అవసరం మాకు చాలా ఉంది." అని లోకం మిమ్మల్నెంతో ఆప్యాయంగా పిలుస్తోందనుకుంటున్నారు మదర్ కరేజి; పుట : 12.
2. కష్టకాలంలో నీ సోదరులనే ఆదుకున్నావా ? నువ్వు నను కున్నట్లే-కెప్టెన్; పుట : 25.
3. జనం చాలామట్టుకు మంచిదే, అక్కడా అక్కడా పప్పులో కాలువేసేవారు జనంలో ఉన్నా-మదర్ కరేజి; పుట : 26.
4. పంచుపొగ మనల్ని ముట్టడిస్తుంది, ఉక్కిరి బిక్కిరి చేస్తుంది అదంతా కొంచెంసేపే! తరవాత్తెరిపోతుంది-మదర్ కరేజి; పుట : 69.
5. ఇకమీద బేరాలేరావు. నువ్వే చెప్పాలి. ఇలాంటి అవాంతరాల నుంచి బయటపడటానికి మంచిదోవ : మదర్ కరేజి;- మదర్ కరేజి. పుట : 93.

పైన చూపినవి కొన్ని మచ్చుతునకలు మాత్రమే. సమీక్షకునికి గ్రంథవిస్తరణభీతి అభ్యంతరం కలిగిస్తోంది. దైనందిన జీవద్భాషతో సంబంధం తెగిపోయినందువల్ల కావచ్చు వారికి తెలుగు నుడికారం అందుబాటులోనికి రాలేదు. కనుకనే- 1. కల్మిబుల్మి కబుర్లు 2. రైతు వాళ్ళబ్బాయి. 3. మాటామంచీ 4. గుండుసామాను 5. 'యుద్ధంలోగాని అలాంటి కోవకు చెందిన మరే సంగ్రామంలో గాని (?)'; ఇలా అసంఖ్యాక పదబంధాలు అర్థస్ఫోరకతను శక్తివంచన లేకుండా భంగం కలిగించాయి. శైలీరమ్యతను చెడగొట్టాయి.

మాటల మాట అలా ఉంచుదాం. ఈ నాటకంలో చాలా పాటలున్నాయి. 'బ్రెక్ట్' గొప్పకవి అని ముందే మనవి చేసాను శ్రీ శర్మగారు బ్రెక్ట్ పాటల అనువాదంలో వీలయినంతగా కవితాస్పర్శను దూరీకృతం చేయడంలో శక్తివంచన చూపలేదు దానికి కారణం వారికి పాపం ఇతఃపూర్వం కవితా రచనాభ్యాసంలేదు. కనకనే బొత్తిగా వచనపు తుంటలను చప్పగా పేర్చి పాటలన్నారు.

## ముగిస్తూ......

ఒకమాట చెప్పితీరాలి. మూలరచయిత దర్శనలోనూ ప్రదర్శనలోనూ శక్తిమంతుడు. తాత్త్విక అవగాహనలోనూ పాత్రల శీల పరిశీలనలోనూ అద్భుతశక్తిమంతుడు. అనువాదం సమర్థంగా లేకపోయినా బ్రెక్ట్ ప్రతిభగాని, అతని కళాతేజశ్శక్తిగానీ మరుగున పడదు. బ్రెక్ట్ ప్రభావం మన జ్ఞానభాండారానికి కొత్తతలుపులు తెరుస్తుంది. మన కళా పిపాసకు కొత్త సంపద చేకూరుస్తుంది. ఈ సత్యం-బ్రెక్ట్ తరఫున ఈ సమీక్షకుడు హృదయపూర్వకంగా విశ్వసిస్తూ ఈ గ్రంథాన్ని ప్రతివారూ చదవాలని ఆహ్వానిస్తున్నాడు.

# కలగూరగంప

## మెసొపొటేమియాలో కుక్కల స్మశానం

మ్యూనిక్ విశ్వవిద్యాలయం పురావస్తు శాస్త్రజ్ఞులు ఇటీవలే పాచీన బాబిలాన్ నగరముయిన "ఇసిన్" ప్రాంతంలో తవ్వకాలు జరిపి ఒక దేవాలయాన్ని కనిపెట్టారు. ఇది "గులా" అనే దేవి గుడి ఈ దేవి ఇసిన్ నగర వాసులకి ప్రత్యేకంగా పూజనీయంగా ఉండేది. తవ్వకాలు జరిగినచోటుకి ఇప్పుడు "ఇషాన్ బహియాట్" అనే పేరు ఉంది. ఇది బాగ్దాదుకి ఆగ్నేయంగా సుమారు 200 కిలో మీటరుల దూరంలో ఉంటుంది. ఇరువయిపుల టైగ్రిస్, యూఫ్రెటిస్ నదులు పారుతాయి. అక్టోబరు '75లో మొదలయిన తవ్వకాలు ఈ జనవరిలో ముగిశాయి. వీటిని జరిపించిన వ్యక్తి, మ్యూనిక్ యూనివర్సిటీలో మధ్యప్రాచ్య పురావస్తు శాఖ ప్రొఫెసర్ బార్తెల్ హ్రౌడా

ఈ ఘన బృందం చేసిన ఖననాలలో తాబేళ్ళు, అడవి పందుల అవశేషాలు దొరికాయి అంటే నేటి ఎడారి ప్రాంతం ఒకనాడు ఎన్నో సరస్సులు కలిగి ఉండేదన్నమాట.

క్రీ పూ 2000కి కొంచెం ముందు ఇసిన్ కాల్డియా జాతివారి రాజధాని (సుమేరియా దేశానికి) అయింది. మెసొపొటేమియాలోని తమకితోచిన నగరవాసులు సుమేరు జాతివారి దైవాలని పురదైవాలుగా ఎన్నుకుంటూ ఉండేవారు.

ఇసిన్ యొక్క దేవి గులా. ఈమెకి పవిత్రమయిన ప్రాణి కుక్క. పురావస్తు శాస్త్రజ్ఞులు 33 కుక్కల ఎముకల గూళ్ళుకల ఒక స్మశానాన్ని బయటపెట్టారు.

ఇక్కడే ఒక ఆలయం బయట పడింది. దానిని సుమేరు జాతివారు 'ఎగెల్ ... క్' అని పిలిచేవారు. ఈ గుడి లోపల గదులు, మండువాలు, ప్రధాన మందిరం మొదలయినవి ఉన్నట్లు గ్రహించవచ్చు. గోడలు పది అడుగుల పయిన మందంగా ఉన్నాయి. ఎండబెట్టిన ఇటికలు నిర్మాణానికి వాడబడినాయి.

ఇక్కడి శాసనాల ఆలయం చరిత్ర క్రీ. పూ. 6వ శతాబ్దం నుంచి (రెండవ నెబుచాద్ నెజార్ కాలంనుంచి) క్రీ. పూ. 20వ శతాబ్దానికి (పశ్చిమ సెమెటిక్‌జాతికి చెందిన ఇసిన్ రాజ్యవంశం కాలానికి) తీసుకుపోతాయి.

తవ్వకాలలో నీరు రావటంవలన పురావస్తు శాస్త్రజ్ఞుల పనికి ఆటంకం వస్తోంది; కాని, ఇంతదాకా బయటపడిన వాటికన్నా పాత అవశేషాలు ఉన్నట్లు ఊహించటానికి అవకాశాలు ఉన్నాయి.

(సుడ్‌డాయిట్‌ష్‌త్సాయిటుంగ్ – పత్రికలో పడిన వార్త ఆధారంగా.)

* * *

## సీత లక్ష్మికాని సీతాలక్ష్మికాదు

వసుచరిత్రలోని యిష్టదేవతల్లో సీతాదేవి రామునికి ద్వితీయ స్థానాన్ని ఆక్రమించుకొంది.

సకల లోకాభి వంద్య కలాకలాపంబు
        దొరయు నెమ్మోము చందురుని తోడ
బహు దివ్యఫల పరిపాక సౌభాగ్యంబు
        నెరపు కెమ్మోవి మానికముతోడ
నవ వయశ్శ్రీ నిధానంబులై తగు సురో
        భవ సుధా పూర్ణ కుంభములతోడ
నమ్లాన సుమమాలికాభి రూప్యముఁ దాల్చు
        లలిత భుజాకల్పలతలతోడ
        నడరి, జనకాబ్ధి సీమ, రామాభిధాన
        హరికహీన గుణప్రోత హారశరాస
        గిరి మథన యత్నమునఁ దోఁచు సిరి యశేష
        రాజ్యములొసంగుఁ దిరుమలరాయ మణికి (1-2)

ఇందులో కవి సీతను సీత అనకుండా సిరి అని పేర్కొన్నాడు. గనుక 'శ్లేష సంకీర్ణ రూపకము' అలంకారమని వ్యాఖ్యాతలంటారు. దాన్ని నేను అది తర్కితమయిన నిర్ణయమంటున్నాను. ఎందుకో మనవి చేస్తున్నాను. అవధరించండి!

కవి హృదయం సీతను సిరిగా అపహ్నవించడము. అదీ హేతుపూర్వకంగా. కానప్పుడు ఆ అలంకారానికి యిక్కడ అందమే వుండదు.

ఇలాగ అపహ్నవించడానికి కారణమేమిటో ఊహిస్తే చమత్కారమయిన సమాధానం దొరుకుతుంది. లక్ష్మి డబ్బులున్న తల్లి.

అయితే తిరుమలరాయలకు మరింత ఐశ్వర్యం కలిగజేస్తుందని కావచ్చు.

ప్రధానమైన తర్కసహమైన యీ అలంకార నిర్వహణలో కవికి శ్లేష చేదోడయింది. రూపకం తోడ్పడింది. కవి సమయాలు సహకరించేయి.

కారణం పద్యానికి వింత సౌందర్యాన్ని సంతరించింది కవి సీతలో కనుకొన్న లక్ష్మి తాలూకు ధర్మాలు: లక్ష్మి పాలకడలినించి పుట్టింది. మందరగిరిని కవ్వంగావేసి, దానికి వాసుకిని తాడుగాచేసి పాలకడలిని తరిచినప్పుడు చంద్రునితో, చింతామణితో, అమృత కుంభంతో, కల్పవృక్షంతో పుట్టింది పుట్టి హరిని వరించింది.

ఈ ధర్మాలను సీతలో చూపడానికి సహకరించిన కవి సమయాలు, వంశాన్ని సముద్రంతో, మోమును చంద్రునితో, కుచాలను కుంభాలతో, బాహువులను లతలతో పోల్చడాలు.

అయితే సీతకీ సిరికీ కవిచేసిన సాధర్మ్య కల్పనలో సహృదయుల ఒప్పుదల కావలసిందే! మెప్పుదల అనివార్యమవుతుంది.

సీసపాదాలు నాల్గిటిలోనూ రూపకాలకు ముందుగల సమాసాలు విశేషణాలు. ఆ రూపకాలకే వాటిలో శ్లేషవుంది. మొదటి రెండు విశేషణాలలో శబ్దంవల్లనూ, కడమరెండు విశేషణాల్లో అర్థం వల్లనూ అది కల్గుతుంది. అది ఉపమానానికీ ఉపమేయానికీ విశేషణ సాధర్మ్యం సమకూరుస్తుంది.

సీతమోము లావణ్యంతో ఒప్పారుతుంది. అది సకల జనుల చేతనూ మిక్కిలి మెచ్చదగింది. చంద్రుడు 'కళల నెలవగువాడు' ఆ కళలు అన్నిలోకాలచేతనూ మిక్కిలి మెచ్చదగినవి.

సీత వక్షోజములు యౌవనానికి నిధానములు. సుధాపూర్ణ కుంభము త్రిదశత్వాన్ని ప్రసాదించగలదు. ఈ రకంగా ఆ విశేషణాలను అన్వయించాలి!

జనకాబ్ధిసీమన్ జనక (వంశము) అనెడి (క్షీర) సాగర ప్రదేశమందు అబ్ధిసీమన్ అని పూరకుండినా కవి, పాలను మనం కలుపుకోవాలి. లక్ష్మి పుట్టింది అందుండి గనక. జనక శబ్దం వంశానికి నామమే కాని వ్యక్తికి పేరు కాదుగదా! ఇప్పడి రూపకానికి సాధర్మ్యం వంశాన్ని సముద్రంతో పోల్చడమనే కవి సమయంవల్ల కలుగుతుంది.

అహీనగుణ...'అహీన' అన్నప్పుడు సభంగమూ 'గుణ' అన్నప్పుడు అభంగమూ అయినశ్లేష.

అ + హీన + గుణము, అహి + ఇన + గుణము

ఇప్పుడు అహీన గుణమనెడ అహీన గుణముతో అని రూపకం. ఈ రూపకానికి సాధర్మ్యం శ్లేషలో.

హరశరాసగిరి — 'హరశరాసనమనెడి (మందర) గిరితోడి — మథనమునందు' అని అర్థం చేయాలి! అంతేకాని శిష్ట రూపకం కాదు అర్థద్వయమేలేదు. అది కవి హృదయమూ కాదు. మరి వింటికీ ధనువుకీ సాధర్మ్యం అహీన గుణంలోని శ్లేషవల్ల జరుగుతుంది. ఎందుకంటే హరశరాస గిరి అహీన గుణంతో 'కూర్చబడింది' గనక. ఆ మాట (పోత) కవి అన్నాడు గనక.

మెఱ్ఱోమము చందురునితోడ అన్నప్పుడు రూపకానికి యేటు వంటి విపత్తిలేదు.

కెమ్మోవి మానికముతోడ - కెంమానికమని చెప్పినా మనం చింతామణిని గ్రహించాలి. కవి హృదయమిదే లక్ష్మి చింతామణితో పుట్టింది గనక, మరి కెమ్మోవిలోనూ, చింతామణిలోనూ సాధర్మ్యం ఎరుపుదనం, ఈ సూచన కెమ్మోవిలోవుంది.

ఇక్కడొకమాట: సాహిత్యాన్ని అందునా వసుచరిత్రవంటి కావ్యాన్ని విమర్శించేటప్పుడు పట్టూ విడుపూ ఉండాలి! ఉంచాలి!!

ఉరోభవ సుధాపూర్ణ కుంభములతోడ కుచాలను కుంభాలతో పోల్చడమనే కవి సమయం ఈరూపక సాధర్మ్యానికి సహకరిస్తుంది.

ఈ సందర్భంలో వ్యాఖ్యాతలు శంకిస్తున్నారు చూడండి! "క్షీర సముద్రము దఱచి నపుడు జనించిన సుధాభాండమొకటియై యుండనిట బహుత్వమునకు కారణము విచార్యము" ఈ శంక సరసంగాగాని సహృదయ సమ్మతంగాగాని అనిపించదు. అంటే కోపం వస్తుందిగాని, స్వతంత్రశబ్ద పరీక్షకు కొంతవరకూ అనర్థమైనా ఉదాహరణమవుతున్నది. అయినా ఈ పద్యాన్ని వ్యాఖ్యానించడంలో వారు పొరపాటు పడ్డారు.

లలితభుజా కల్పలతలతోడ క్షీరసాగరంనించి కల్పవృక్షం పుట్టగా కవి కల్పలతగా సవరించుకొన్నాడు ఉపమానవచనం వ్యత్యాసమని అనుకొన్నట్టిదే! స్త్రీల బాహువుల్ని చెట్లని యే మొరటుమనిషి అనలేడుగదా! లలిత భావాలుగల కవి యెందుకంటాడు? ఈ సవరణ జరిగినప్పుడుగాని కవి సమయం సాధర్మ్యాన్ని చూపించలేదు

కాగా; 'అహీనగుణ ప్రోత హరశరాసగిరి మథన యత్నం'

లేనప్పుడు సీతలోనూ సిరిలోనూ సమానమయిన ధర్మంగా పుట్టుకను భావించవచ్చు ఆ సమాసం ఉండడంవల్ల - మందరగిరితోడి మథన యత్నంలో సిరిపుట్టిందిగాని, శివధనుర్భంగ మప్పుడు సీత పుట్టలేదు.

ఈ వైధర్మ్యాన్ని తొలగించడంలో కవికి కారకం మిక్కిలి సహకారి అయింది. 'తోడ' వర్ణకం 'అడరి' అనే క్రియతో, అన్వయిస్తున్నది.

తెలుగు కారకాలకుగల దీప్తి యేమిటో మనమిక్కడ గుర్తించవచ్చును. వ్యవహార విదుడయిన మహాకవి మాత్రమే భాషాగతమయిన యిలాంటి కీలక స్థానాలు గుర్తించగలడు గుర్తించి గ్రంథస్థమూ చేయగలడు.

హరిరాములకు సమత అభిధానంతో ముడిపడింది. ఆ రామాభిధానహరికి యీ సిరి (సీత) లభించింది.

తాత్పర్యమిది: జనక వంశమనెడి క్షీరసాగర ప్రదేశమందు వింటినారి అనెడి వాసుకితో కూర్పబడిన శివధనుస్సు అనెడి మందరగిరితోడి మథన ప్రయత్నములో ముఖమనెడి చంద్రునితో మోవి అనెడి చింతామణితో వక్షోజములనెడి అమృత కుంభాలతో బాహువులనెడి కల్పలతలతో అందగించి రామనామంతో వ్యవహరిస్తున్న హరికి లభించింది కనక యీమె 'సిరి' (సీత)

ఆమె తిరుమల రాయలకు అశేషరాజ్యాలనూ కలిగజేయాలని కవి ఆశయం.

చప్పు చప్పని కవి సమయాలకొక దీప్తి. ప్రయోజనవనా.

హరిశ్చంద్ర నలోపాఖ్యానంలోనూ ఈ కవి సీతను 'నవీనలక్ష్మి' అంటాడు. అతని భావనలో జనిస్తున్న లక్ష్మికి విలువయిన నెలవుంది. వసుచరిత్రలోనే మరొకచోట, "కృపాణ కృష్యమాణ నిర్మథ్యమాన రణార్ణవ సముత్పన్న విజయలక్ష్మీ ...." (1.14) అంటాడు. రామరాజభూషణుని యీగుణం గమనింపదగింది.

ఆలంకారిక రచన మిక్కడ సొగసులు పోయింది కదా!

— నాగార్జునశ్రీ



# గ్రంథ విమర్శలు

## భారతీదేవి దివ్యస్మృతులు

రచయిత—ఆచార్య యన్. జి. రంగా. ప్రజాలేకు-కిసాన్ పబ్లికేషన్సు నిడుబ్రోలు. వెల : రు. 16. పుటలు కి 40+18.

రైతు బిడ్డలకు, రైతునాయకులకు నడిబొడ్డైన గుంటూరు మండలంలోని నిడుబ్రోలులో జన్మించిన రైతు బాంధవుడు రంగా. వారి సతీమణియు ఆ ప్రాంతమునకు చెందినవారే.

1920నుంచీ యాభై సంవత్సరాలపాటు ఈ దంపతులు స్వదేశంలోనేగాక విదేశాల్లో పర్యటించిన కాలంలో వారికి కలిగిన ఊహలు, పొందిన అనుభవాలు ఇందు పొందుపరిచారు. దేవీజీగారి జీవన విధానం, అభ్యుదయ భావాలు రంగాగారిచే వ్యాఖ్యానింపబడినాయి ఈ గ్రంథంలో. మనదేశం సాంఘిక రాజకీయ చైతన్యాన్ని సంతరించుకున్న గాలమిది. 'మురక ఖద్దరుకు అందాన్నిచ్చేది దేవీజీ రూపం. కన్నులు కరుణాతరంగితములు.' అని దేవీజీనిగూర్చి సరోజినీ దేవి చెప్పిన మాటలు. తన యర్ధాంగి రూపాన్ని రంగాజీగారు పై రీతిని పరోక్షంగా వ్యాఖ్యానించారు.

ఈ దంపతులు అనేకములగు చారిత్రక స్థలాలను జూచారు. చారిత్రక చిహ్నములను మానవతావాదం దృష్టితో పరిశీలన కావించారు. ఈ పరిశీలనమునకు మూలము జాతీయదృక్పథం. ఈ గ్రంథంలోని 75వ పుటలోనున్న ఔరంగజేబు మసీదు సందర్శనంలో వారికి గలిగిన భావములు ఈ యంశమునకు సహకరించుచున్నవి.

భారతీదేవికి కాళ్ళు కాలి బొబ్బలెక్కటం, దానికి బాధపడిన రంగా మందు వేయటం అనే అంశాలీ గ్రంథంలోని 35వ పుటలో ఉన్నవి. ఆనాడు వివాహితులైన యువతీ యువకుల ప్రవర్తన, కింపుమెయొక్క దృక్పథము మనకు విశదమగును. నేటి వైవాహిక జీవన విధానముపై విదేశీయమగు ప్రభావము గలదనియు, కావుననే వెనుకటివలెగాక నేటి యువదంపతులు స్వతంత్రముగ ప్రవర్తింప గలుగుచున్నారనియు తలంపవగును.

రంగా దంపతులు ప్రయాణము చేయుచున్న ఓడలో అగ్ని ప్రమాదము సంభవింపగా అందుండి సముద్రములోనికి దూకి ప్రాణ రక్షణమునకై తోటివారు ప్రయత్నించుచుండిరి. అపుడు నీటదూకిన మునిగి చచ్చిపోవలసియుండును. అంతకన్న మంటల కాహుతి యగుటయే సుకరమని దేవీజీ యిచ్చిన సలహా ప్రశంసనీయము. గ్రామీణ సమస్యలపై, రైతు కూలీల రక్షణకై దేవీజీ చేసిన ప్రసంగము లుత్సాహ జనకములు. ఈ దంపతుల మధుర స్మృతుల తలంపులీ కావ్యము. తలంపుల పులకింతలు అనుభావాల జలధిలోకి రంగాజీ స్మృతిమయమను వలను విసరగా అందు వివిధ వర్ణములకు వర్గములకు చెందినందున సామ్యములేని తలంపులు స్మృతిపథంలో మెరిశాయి. వాటిని అలాగే సంపుటీకరించారు రంగాజీ.

ఇందులో పదాల కందని భావాలున్నాయి. ఇది సర్వ జనాదరణీయం. అవశ్యపఠనీయం. ఆదర్శ దాంపత్య జీవన విధానం, రైతు జీవితం యిందు సురమ్యంగా వర్ణితములయినవి.

—శ్రీ జె. సూర్యనారాయణ

## 'రత్నత్రయి'

(ప్రథమభాగము. 'శ్రీ చరణరేణువు' సమకూర్చిన టీకతో—'భగవదభిరుచి' అను అణువ్యాఖ్యతో) ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా. వెల : 8 రూపాయలు. మూలం—తమిళం, టీకా వ్యాఖ్యలు-తెలుగు.

1 తిరుప్పల్లాణ్డు, 2 తిరుప్పళ్లియెళుచ్చి, 3 తిరుప్పావు అనే రత్నాలు మూడూ కలిసి 'రత్నత్రయి'గా రూపొందాయి.

'తిరుప్పల్లాండు' పలికిన మహానుభావుడు పెరియాళ్వారు (విష్ణుచిత్తులు). ద్రావిడ వేద నిగూఢార్థాలు 'తిరుప్పల్లాండు'లో స్ఫురిస్తాయి.

ఇది శ్రీపతికి పలికిన మంగళాశాసనం. విష్ణుచిత్తుని పాక్తన పుణ్యఫలముగ లభించిన శిశువు గోదాదేవి శ్రీరంగనాథుని యిల్లాలయిన ధన్యాత్ముమరాలు. జనకుని వంటివాడు విష్ణుచిత్తుడు, సీత వంటిది గోదాదేవి. కనుక మామగారు అల్లుడికి మంగళా శాసనం పలకడం న్యాయమే.

'మా స్వామి కట్టివదలిన పీతాంబరము మా తమే మేము ధరింతుము. తద్భుక్తశేషమునే భుజింతుము. ఆయన ముడిచి విడిచిన తులసీ దామములనే మేము కైసేసికొందుము. స్వామి యానతిచ్చిన కైంకర్యము చేయుటయే తదీయ దాసులమగు మా యనుష్ఠానము. శ్రవణ నక్షత్రోత్సవ సందర్భమున పడగలు విప్పిన ఆదిశేషుని పై చక్కగా పరుండియున్న శియఃపతికి దృష్టి తగులకుండ మంగళ శాసనము చేసెదము—

9వ మంగళా శాసనం వివరణం ఇది.

తిరుపళ్లి యెళుచ్చి పాడిన ధన్యచరితుడు తొండరడిప్పొడి యాళ్వారు అనే నామాంతరంగల విప్రనారాయణుడు ఇది శ్రీరంగ నాథుని మేల్కొలుపు.

'మొల్లల పరిమళముతో ప్రభాత వాయువు వీస్తూంది తామర పూవు పై నిద్రించిన అంచజంట మంచు రెక్కలను జాడిస్తూ మేల్కొంది. మకర దంష్ట్రలనుంచి విడిపించి గజేంద్రుని బాధ పోగొట్టిన 'శ్రీ రంగనాథా మేల్కోస్వామీ'—అని చెప్తూంది రెండవ మేల్కొలుపు పాట. చక్కని భావాల చక్కదనాల చుక్కవే యీ గీతిక లన్నీ

మూడవరత్నం 'తిరుప్పావు'—గోదాదేవి తనను గోపికగా భావించుకుని ధనుర్మాసవ్రతం నిర్వహించే భావనతో పాడిన పాటలివి. మొత్తం ముప్పది. విష్ణుచిత్తునికి తులసికోటలో లభించి అతని యింట నాటి సీతలాగా పెరిగి శ్రీరంగనాథుణ్ణి ప్రేమించి యిల్లాలయిన మారటలచ్చి తాను కంఠాన వేసుకుని తీసివైచిన పూదండ రంగనాధుని కంఠమాలికగా సమర్పించిన బాల. కనుకనే యీమెకి 'ఆముక్తమాల్యద' అనే పేరు సార్థకమయింది. భక్తి భావన కలిగించేదై మోక్షప్రదమైన వాక్కును అనుగ్రహించింది కనుక 'గోద' అనే పేరుతో ప్రసిద్ధురాలైంది. ఆండాళ్, చూడిక్కొడుత్తాళ్. కోదై అని అరవం పేర్కున్నాయి యీ తల్లికి. యీ దేవి చరిత్ర 'ఆముక్తమాల్యద' అనే పేరుతో మహాప్రబంధముగా రచించి ఆంధ్ర వాఙ్మయానికి 6వ వ్యాలంకారం సమర్పించిన పావన జీవనుడు శ్రీకృష్ణదేవరాయలు.

యీ 'తిరుప్పావై' తమిళదేశములో ధనుర్మాసములో నేటికి నూటిగా గ్రామఫోన్ రికార్డుల మూలంగా కూడా వినవస్తూ ఉంటుంది. అంత బహుళ ప్రచారం పొందిన 'పాశురాలు' ఇవి. ఒకప్పుడు సంగ్రహ వాక్యాలుగా వీటిని నేను భావం మాత్రం తీసుకుని తెలుగులో వ్రాశాను. వీటికి చక్కని వ్యాఖ్య వ్రాసి విశేషార్థాలు వెల్లడించిన 'శ్రీ చరణరేణువు'—అనే గూఢనామంగల ఆచార్యులవారు ధన్యులు, తెలుగు భక్తజనానికి వందనీయులు

ఈ పాటలు 'అష్టపదులు' మనం సామాన్యంగా వినే అరవం కన్న యీ పాటలలోని అరవం హృదయంగమంగా ఉంటుంది. అరవం ఇంత మధురంగా ఉంటుందా! అని అబ్బురపాటుతో వింటాము ఆ దివ్యమాత నోటవచ్చిన వాణి కనుక అలా అనిపించుతుందేమో మరి.

సూర్యోదయం అయిన తరువాత కూడా నిద్దురలేవని ఒక ముద్దుగుమ్మను కాస్త కటువుగా 'అజ్ఞానహీనురాలా!' అని సంబోధించి ఆ తల్లి ఇలా అంటుంది:

మమ్మల్ని ముందు లేపుతానన్నావు ఇంకా నిద్రపోతున్నావా! చూడు. పెరటి తోటలోని దిగుడు బావిలో ఎర్రకలువలు వికసించాయి నల్లకలువలు ముడుచుకున్నాయి కాషాయ వస్త్రధారులూ, తెల్లని పలువరుస గలవారున్నూ అయిన సన్న్యాసులు శంఖ తీర్థాభిషేకం చెయ్యడానికి దేవాలయాలకు వెళ్తున్నారు. మమ్మల్ని ముందుగా లేపుతానని తియ్యగా పల్కి నిద్రపోతున్నావా సిగ్గుమాలినదానా! శంఖ చక్రధరుణ్ణి, శతపత్రనేత్రుణ్ణి మాధవుణ్ణి సేవించాలి లే...ఇలా ఉంటాయి తిరుప్పావు గీతాలు.

తమిళమూలానికి ప్రతిపదార్థం, వివరణా తెలుగులో ఇచ్చి భక్తుల శ్లోకాలూ, తమిళ పద్యాలూ, తెలుగు పద్యాలూ వాటికి సమర్థకములుగా ఉదహరించి 'శ్రీ చరణరేణువు' అనే యీ వ్యాఖ్యాత జన్మ సార్థకమైన పనిచేసి తెలుగువాణికి తమిళ సోదరి చెలువును సంతరించి మహోపకారం చేశారు.

చక్కని భావతో చిక్కని భావాలు వివరించి ధన్యులయారు భక్తిభావముగలవారే కాక భాషాంతర విశేషాలు తెలుసుకోవలెననే 'జిజ్ఞాస' కలవారుకూడా చదువదగిన రచన. వెల కొంచెం తగ్గిస్తే బాగుండునని అనిపించింది.

— శ్రీ యామిజాల పద్మనాభ స్వామి

# 1. కవితా స్రవంతి

[హితసాహితి ప్రథమ వార్షిక సంచిక: ఖండ కావ్య సంకల

నము. [క్రౌన్ 1/16 – 46 పుటలు; వెల రు 2/- దొరుకు చోటు : గుండి వెంకటాచార్యులు, పెద్దగిర్నిదగ్గర, కామారెడ్డి–503111.]

ఈ స్రవంతిలో వాగులు వంకలు కొన్ని కలిసిఉన్నవి; అంటే - పదముగ్గురి రచనలు చేర్చబడిఉన్నవి. ఇది హిత సాహితి వారి వార్షిక నివేదికా (1975) రూపమైన కవితా సంకలనం. ఆ మారుమూల చిన్న కామారెడ్డి పట్టణంలో సాహిత్యం విస్తారడం పొగడదగిన ప్రయత్నం. ఇది కొందరికి కవితాభ్యాసంగా, మరికొందరికి దానిని సొవలు దీర్చుకొనడంగా ఉన్నది. ఈ రచనల ప్రచురణ గణనీయము.

క్రౌంచగీతం (వంశీ) భావంతోబాటు చిక్కటి భాషను చక్కటి మడికారాన్ని ప్రదర్శిస్తున్నది:– "కనులకొలకుల కజ్జ లాంకిత కలుషనీరము నిండుకొనియె"; "మనసు మోడుగ మార సంతకు", తపనలో (కసిరెడ్డి వెంకటరెడ్డి):– "నిశ్శబ్ద నీరవ నిశీథినిలో" అని ప్రారంభిస్తారు. ఈ ప్రయోగం పేపరుకాగితం వంటిది.

"ఉత్తుంగ తరంగాల్లాంటి నా భావోద్వేగము క్రుంకే సూర్యునిలా చప్పన చల్లారిపోయింది"; అంటే – మంచి ఊహను చక్కటి భాషలో పొదగగలిగిన సాధకుడుగా ఉన్నారు. ఈ రెడ్డి "చూచిండు" వంటి తెలంగాణా మాండలీకాలను ధైర్యంగా ఉపయోగించినారు. వివిధ స్థానికాలే భాషకుపుష్టి – జీవము. కృష్ణాతీరాన ఒకే అచ్చులో పోతపోస్తే భాష చచ్చుబారిపోతుంది. విశ్వమిత్ర (పెద్దలందరు విశ్వామిత్ర పదాన్ని తలదాల్చిఉంటే ఈయన దానికి శృంగభంగం ఎందుకు చేయవలసి వచ్చిందో!) చేయి తిరిగిన వ్రాత కాదు. భావం భాష ప్రౌఢంగా ఉన్నవి: "కనుచూపులకాంతి సంగీతంలో" "కన్నీళ్లతో పెరిగిన ఈ మధురరసాన్ని"; "నా అశ్రుసిక్త రుధిర గీతాన్ని ఆనందంగా అందుకున్నాడు"; "పథవిహీనమైన జీవితాన్ని"; "నిరాశా శ్మశానంలోనుంచి చీకట్లో తడుముకొంటూ" అని అన్లగలిగిన ప్రౌఢిమగలవారు. విశ్వమిత్ర 'అన్వేషణ' మంచి కవితాశిల్ప స్ఫూర్తికంగా కమ్మగా ఉన్నది. వర్షిములు ఏమో వ్రాసినారు. ఒక రచయిత తన పేరు స్ఫురింగునే ఇట్లా చెడగొట్టుకోవాలి? మల్లిఖార్జునం జనార్దనం–మధుసూధనం–కోటేశ్వరం–ఈ తెగకు చెందిన వారే. శీర్షసుమము (వ్యాస్) మంచి నుడికారంతో అలరారుతున్నది: "మమతలు పల్లవింప"; "సిగ్గుకెంపులు విరిసిన బుగ్గలపుడు"; "ప్రణయభావంబు మదిలోన పరువులెత్త"; "వెలసిపోయే వెన్నెల వెలుగులెల్ల"; "చెదరియున్నది వెన్నెల క్షీరమట్లు" మొదలైనవి ఈయన పసన దొవలవంటి ప్రయోగాలు.

మిగత మిత్రుల రచనలు మెరుగు తేలగలవని ఆశ కలుగుతున్నది. ఈ తడవ అచ్చుసుగూడ వృద్ధిచేస్తారనుకొంటా.

– శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి

# గ్రంథస్వీకారము

1) విర్డోషి (నాటకము). రచన: కవిభూషణ, విద్వాన్ నిట్లా రామకృష్ణారావు. ద్వితీయము ద్ర. పేజీలు : 64 వెల: రూ. 2-00. ప్రతులకు : రచయిత; సర్కిల్ పేట, మచిలీపట్నం.

2) రమణీయరామాయణము (ఉత్తరకాండము). కావ్యకర్త: శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్య పేజీలు: 112 మూల్యం రూ. 5 00; ప్రతులకు : శ్రీ డి. భాస్కర్; 5/24 ప్రకాష్‌నగర్; నెల్లూరు-2.

3) శిథిలాలయము (పద్యకావ్యము) రచయిత: శ్రీ భైరవరసు; పేజీలు : 69; వెల రూ. 2 00; ప్రాప్తిస్థలము: శ్రీ భైరవరసు త్రివిక్రమరావు; 7, నటరాజ గ్రామణి గార్డన్స్ ఫస్ట్ స్ట్రీట్; తిరువత్తూరు; మద్రాసు–19.

4) శ్రీ మహిళాభ్యుదయమ్ (పద్యకావ్యము) గ్రంథకర్త : శ్రీ ఊరుబిండి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి; పేజీలు 81; వెల రూ. 4–00; మహిళలకు మాత్రం రూ 3-50; ప్రతులకు : గ్రంథకర్త, శాస్త్రీభవన్; బాలాజీనగర్; నెల్లూరు 2.

5) పాండిచ్చేరి గీతాలు పన్నెండు· రచయిత: శ్రీ సు ప్రసన్న,

పేజీలు: 20, వెల: రూపాయి; ప్రచురణ: శ్రీ అరవింద కేంద్రము; నర్సంపేట; వరంగల్ జిల్లా.

6) ఓల్గా తరంగాలు (సోవియట్ సాహితీ సమాలోచన) రచయిత: శ్రీకాంత్, పేజీలు: 103; మూల్యం: రూ. 3—00. ప్రతులకు: ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం; మఖ్దూంమార్గ్, హిమాయత్‌నగర్; హైదరాబాద్ -29.

7) ప్రబోధమాల (గేయ సంపుటి) రచయిత: శ్రీ కపిరెడ్డి వెంకటరెడ్డి; పేజీలు: 34; వెల రూ. 2-00; ప్రతులకు: రచయిత; కాలేజీ ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్; కామారెడ్డి=503111. నిజామాబాద్ జిల్లా.

8) విమలానందభారతి (సాహిత్యమాసపత్రిక) పేజీలు: 12; విడిప్రతి 60 పై; సంపాదకుడు: శ్రీ కారుమంచి కొండలరావు; చిరునామా: సంపాదకుడు; విమలానంద భారతి; బావాజిపేట; విజయవాడ–520003.

9) ఓ గులాబికథ (గేయ సంపుటి) రచన: శ్రీ మూర్తి; పేజీలు: 23; వెల: రూపాయి; ప్రతులకు: శ్రీ వై. అప్పారావు, లక్ష్మీదేవిపేట; అనకాపల్లి; విశాఖజిల్లా.

10) బండ్లమూడిమాట (పద్యకావ్యము) రచయిత: శ్రీ బండ్లమూడి సత్యనారాయణ; పేజీలు: 40; వెల రూ. 2-00 ప్రతులకు: ఇందుమతీ ప్రచురణలు; నరసింహారావుపేట; ఏలూరు–534002.

11) ది వరల్డ్, ఇండియా, ది ఎమర్జన్సీ (ఆంగ్లగ్రంథము), రచన: శ్రీ స్వామి బాలానంద; ద్వితీయ ముద్రణ; పేజీలు 33; వెల రూ. 2=50 పై. ప్రాప్తిస్థానము: బాలానంద భక్తబృందం; దేవాలయంవీధి; కాకినాడ-1.

12) స్వాన్ మెస్సెంజర్ (శ్రీ వేదాంత దేశికుని హంస సందేశం) ఆంగ్లపద్యమాలిక; రచన: శ్రీ ఎస్. రామానుజాచార్య; పేజీలు: 51; వెల రూ. 2=00. ప్రతులకు: రచయిత, బ్రాహ్మణవాడి; ఖమ్మం-507001.

* * *

1) మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి జీవితచరిత్ర; ర యిత: సాహిత్య శిరోమణి శ్రీ సముద్రాల లక్ష్మణయ పేజీలు: 424; గ్రంథంవెల: రూ. 6/-, ప్రతులకు మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము, శ్రీ వ్యాసాశ్రమంపోస్ ఏర్పేడు మార్గం, చిత్తూరు జిల్లా.

2) శ్రీ దేవపూజా ప్రసూనములు (శతకసంపుటము); క కర్త: విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, పేజీలు 154 వెల: రూ. 5/-, ప్రతులకు: రచయిత; రా రావుపేట, కాకినాడ=4.

3) కలిగుణ ప్రకాశిక (వెంకటేశ్వర త్రిశతి). రచన: కీ. తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి, పేజీలు: 52, నాయ (వెంకటేశ ప్రభు సుమశతకము), రచన: శ్రీ తాడేప రాఘవనారాయణశాస్త్రి, పేజీలు: 16, పై రెండు క పున్న ఈ గ్రంథము వెల రెండు రూపాయిలు. ప్రతులకు శ్రీ కంభంపాటి పురుషోత్తం; పినపాడు, తెనాలి– గుంటూరుజిల్లా.

4) గోమాత (పద్యకావ్యము); రచయిత: శ్రీ భల్లం తిరువ రాజు. పేజీలు: 63; వెల రూ. 3-50, పై. ప్రతులకు శ్రీ ఉదయభాను సత్యనారాయణరాజు; S/o జగ్గరాజు, మా కృష్ణ; కవిటం. ప. గో. జిల్లా.

5) ఆర్ట్ లవర్స్ యూనియన్ (రిజిష్టర్డ్) చిత్తూరువారి రజత త్సవ ప్రత్యేకసంచిక. సంపాదకులు: శ్రీ మధురాంతక రాజారాం; శ్రీ ఎస్. మునిసుందరం. ఈ సంచికలో ప్రము ఖుల సందేశాలు; సభ్యుల, ప్రముఖరచయితల రచనలు సంస్థ నిర్వహించిన కార్యక్రమాల వివరాలు, ఛాయాచిత్రాల కలవు.

6) దిక్సూచి (యువలహరి ప్రసారం-1) పేజీలు 8; వివరమ లకు: యువలహరి; సాహిత్య సాంస్కృతికసంస్థ, మా వీడు–521201.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

